

పంచతంత్రం

# సంధి-విగ్రహం

కర్త...విశ్వాత్ముల నరసింహమూర్తి



(మంత్రి - హిరణ్యగర్భునితో)
"మనము కూడ ఆ ఉలూకములవలె
నేలవర్గుచే మోసపోదుమని
నా కనుమానము కలుగుచున్నయది:
తమ సెలవైనచో ఆలసింపకయి
వని నిక్కడనె హత మొనర్చెదము!"



"ఔను, నిజం ఓ మంత్రీ! - నీవన్నది నిజం
నిజం" - అయినా నాదొక మాట -
ఆగంతుకు డీతడు మన - కేదైనా
అపకారం - తలపెట్టే వరకైనా -
అనుమానం తగదోయీ! - స్థలచర
ములతో సమరం - ఆసన్నం
అయినదిపుడు



"అది ముగిసే వరకీతని - క్రీగంటను
కనిపెట్టుచు - యుద్ధానికి పిలిపింతును
వెనుకటికొక ఎలుక కూడ -
ఈ విధముగ చేసెను కదా?

"ఎవరా ఎలుకా? ఏమా కథ?"



పంచవట ప్రాంతంలో
ఉండేదొక వటవృక్షం



ఆ వృక్షం తొఱ్ఱలోన
రోమశుడను బిడాలం
కలకాలం కాపురముండెను



పలితుండను ఎలుక కూడ
చెట్టుకింద కలుగులోన
చిరకాలం నివసించెను.



ఇట్లుండగ ఒకరాత్రి - కిరాతుడటకేతెంచి -
చెట్టు చుట్టు వురులు పన్ని - సడిసేయక
వెడలిపోయె



వేకువనే నిదురలేచి
ఆహారాన్వేషణకై
చెట్టు దిగిన రోమశుడూ
ఉరులలోన తగుల్కొనియె!



ఇది అంతా పరికించిన - పలితుడు
సంతోషంతో - పెడ తొలగిపోయినదని
- కలుగు విడిచి వెలికి వచ్చి -
యథేచ్ఛగ విహరించెను.



కలుగు విడిచి వెలికి వచ్చి - ఒడలు మరిచి ఆడుచున్న -
పలితుని భుజియించుటకై - గగన వీధి నెగురుచున్న -
చంద్రకుడను ఉలూకమ్ము - నేలమీద వాలింది.



(పలితుడు తనలో) "హా! హతోస్మి! ఏమి చేయుదు?-
అటుపోయిన మార్జాలం - ఇటు చూచిన ఉలూకం! -
ఎటులయినా మృత్యువు తప్పదు. - ముప్పు తప్పు
నుపాయం చక్కగ యోచించవలెను"



సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.




సంపుటము 46
సంచిక 7
21.10-53

సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

విజయ ఆశ్వయుజ శుద్ధ చతుర్దశి, బుధవారం


అన్నదమ్ములు

ఫొటో: టి. వి. కృష్ణంరాజు; ధవళేశ్వరం.

# విషయానుక్రమణిక



## గమనిక

14-10-'53 వ తేదీ ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక (దసరా) సంచికలో ప్రచురితమైన 'సంధి-విగ్రహం' (20, 21)లో కొన్ని అక్షరాలు పూర్తిగా తెలియకుండా పోయినవి. ఆ కారణం చేత, పాఠకుల సౌకర్యంకోసం, ఆ లోపాలనుసవరించి, అదే కథాభాగాన్ని యీ వారం కూడా ప్రచురిస్తున్నాము.

—సంపాదకుడు.




అతనికి వార్థి కుల్యయగు;
వగ్ని జలం బగు; మేరుశైల మం
చిత శిలలీల నుండు; మద
సింహము జింక తెఱంగు దాల్చు; గో
పిత ఫణి పూలదండ యగు;
భీష్మ విషంబు సుధారసం బగున్;
క్షితి జన సమ్మతంబగు
సుశీల మదెవ్వనియందు శోభిలున్.

తా|| ఎవనియందు నిష్కల్మషమైన లోకజన సమ్మతమైన సత్యగుణము శోభిల్లుచుండునో అట్టివానికి సముద్రము కాలువవలె అయిపోవును. జలమువలె చల్లగా ఉంటుంది అగ్ని. మేరువు అంతటి మహా పర్వతము ఒక చిన్న రాయివలె ఉంటుంది. మదసింహము జింకవలె మచ్చిక అవుతుంది. కోపించియున్న సర్పము పూలదండవలె నిరపాయకరమగును. భయంకరమైన విషము అమృతప్రాయ మవుతుంది.

సర్పమును పూలదండవలె మెడలో వేసికొనగల్గిన పాము మంత్రజ్ఞులు చాలామంది ఉన్నారు. కొలది సంవత్సరముల క్రిందట ఒక పర్యాయము ఒక హఠయోగి అద్భుతమైన శక్తులను పబ్లికుగా ప్రదర్శించాడు. పాషాణమును పటికబెల్లపు ముక్కవలె నమిలి మింగివేశాడు. తాచుపాముకోరల నుండి పిండిన గరళమును గంగాఫలం కొబ్బరి నీరులాగున త్రాగివేశాడు. ఖాళీ సోడాబుడ్డిని ముక్కలు ముక్కలుగా పగులగొట్టి కొబ్బరి ముక్కలు లాగున నమిలి మంచినీళ్ళు త్రాగివేశాడు. ఇతనిని పెద్దపెద్ద ఇంగ్లీషు డాక్టర్లు పరీక్షచేశారు. అతనిచేత అనేక పదార్థములు తినిపించి అవి ఏ విధముగా జీర్ణమైపోయినవో అతని అధికొాచమాన అల్పాచమాన పరీక్షలు చేశారు. అతడు నమిలి మింగిన పదార్థము లన్నియు ఏదోవిధంగా రూపాంతరముజెంది మూత్రపురీషములలో కన్పించెను. కాని, అతడు మింగిన పాదరసముమాత్రము ఏమాత్రము జీర్ణముకాలేదు. ఏవిధమైన రూపాంతరము పొందకుండా తిరిగి పాదరసముగానే దేహమునుండి బహిర్గతమైనది. ఈ విషయములను డాక్టరులు శ్రద్ధగా పరిశోధించి స్వహస్తములతో సంతకములుచేసి తమ సాక్షి వాఙ్మూలమును ఆహఠయోగికి వ్రాసియిచ్చారు. యోగశక్తివల్ల యిటువంటి అద్భుతకార్యములను అవలీలగాచేసి అసాధారణ ప్రజ్ఞను చూపగలవారు అక్కడక్కడ యిప్పటికిన్నీ యీ దేశంలో ఉన్నారు. పైజెప్పిన హఠయోగికి *Humam ostritch* (నిప్పుకోడి మనిషి - లేదా మానవోష్ట్రి పక్షి) అని బిరుదు యిచ్చారు.

యోగసిద్ధులు అనేవి ఉన్నాయి. ఈ యోగవిద్య యిప్పుడు, యీ పాశ్చాత్య నాగరికతలో, భౌతికశాస్త్ర యంత్ర ప్రభావ యుగంలో అభావంఅయిపోయింది. ఆయోగ విద్యకే దుర్యోగం పట్టింది. ఇటువంటి యోగశక్తి ప్రభావములను కొన్నింటిని జనానికి చూపించినప్పుడు, అటువంటి యోగులు ప్రత్యక్ష భగవదంశ సంభూతులనిన్నీ, సాక్షాత్తు భగవత్సమానులనిన్నీ, కేవలం లీలామానుష స్వరూపులనిన్నీ, నిరూపించి సాష్టాంగ ప్రణామంబు లాచరించి, వారి వెంటబడి శుశ్రూష చేసి, యేమైనా కొన్ని పరమహంస క్రియలను వారివద్దనుంచి తెలిసికొనవలెననే కుతూహలంతో "భవత్కృపారసము నాపై కొంత రానిమ్ము!" అని యాచించెడి సామాన్య మానవులు చాలామంది ఉన్నారు. ఏదైనా ఒక పసరు అరికాలికి పూసికొన్నట్లయితే, కోరిన ఊరికి, మనస్సులో తలచుకొని మనోవేగంతో, ఎరిగిపోవచ్చునని ఒక సిద్ధుడు చెప్పగానే, "వానిది భాగ్య వైభవము వానిది పుణ్యవిశేష మిమ్మెయిన్ వాని దవంధ్యజీవనము. వానిది జన్మము" అని కొనియాడుతూ వాని వెంటబడ్డాడు ఒక గొప్ప విద్వాంసుడైన బ్రాహ్మణ శ్రోత్రియుడు. అతడు వేదపారంగతుడు. నియమనిష్ఠాగరిష్ఠుడు. మంచి మనోనిగ్రహం

గల గృహస్థు. ఆత్మశాంతిప్రదమైన ముక్తిమార్గమును చూపించగల్గిన దొక్కటే విద్యగాని మిగిలిన విద్యలన్నీ టక్కుటమార గోకర్ణ గజకర్ణ ఇంద్రజాల మహేంద్రజాల విద్యలని ఆ బ్రాహ్మణ శ్రేష్ఠునకు బాగా తెలుసు. ఈ తమాషా ఘోషాయి చట్కాలన్నీ "మీసాలపై తేనియల్ వంటి" చమత్కార మహాత్కారములనికూడా తెలుసు. అయితేనేమి? "పరమంబైన రహస్య"మగు ఆకుపసరును ఆసిద్ధుడు తనకు తెలియజేసేవరకు వాని పాదపూజ చేశాడు. "ఒక పసరిది యది యని చెప్పక" ఆ గృహస్థుయొక్క పాదాలకు పూసి నీయిష్టమైన ప్రదేశానికి జయ్ 'పరమేశ్వరా!' అని పలాయనం కావచ్చు నన్నాడు. అటు తర్వాత ఆ బ్రాహ్మణుడు హిమాలయ పర్వత ప్రాంతాలకు ఎగిరివెళ్లినాడు. చిట్టచివరకు చిక్కులపాలై చీకాకు పడ్డాడు. తాను చేసినపని వెఱ్ఱిపని యని వేయివిధాల పరితపించాడు. ఆ పర్వతప్రాంతాలనుండి తిరిగి యింటికి ఎగిరివెళ్లడానికి ఏవిధమైన పసరన్నా అవసరంలేకుండానే అగ్నిహోత్రుణ్ణి ప్రార్థించి సంకల్పసిద్ధుడై, స్వగృహానికి "స్వాహా వధూవల్లభా!" అనేసరికి సరాసరి ఎగిరివెళ్ళినాడు. ఆసిద్ధునికంటె యీ బ్రాహ్మణుడు ఎక్కువ మహత్కార్యం చేశాడు. తలవని తలంపుగా తనకు మించిన శక్తి తనలో ఉన్నదని గ్రహించాడు.

ఇంతకూ చెప్పవచ్చిన విషయ మేమిటంటే, హఠయోగులు మొదలైన సిద్ధుల వెంటబడి తిరిగేటటువంటి పెద్దమనుష్యులు ముఖ్యంగా కోరేది ఏమిటి? మంచి వ్యాపార లాభం - చక్కని సంతాన ప్రాప్తి. దేహంలోఉన్న మేహంపోయి అరటిపండ్లు తినినా అజీర్తి చెయ్యని ఆరోగ్యం - ఆహార పుష్టి- సంసారసౌఖ్యం—యివే ముఖ్యంగా కావాలి. పిల్లలు కావాలి. కొల్లలుగా పైసా కావాలి. సంసారసౌఖ్యం అపార పారావారంగా కావాలి. ఇత్తడిని బంగారం చేసే సిద్ధు డెవరైనా ఉంటే, ఆ సిద్ధుణ్ని ఎల్లాగైనా వశపరచుకోనగల యోగసిద్ధి మనకు కావాలి. అతని వద్దనుంచి ఆ రహస్యం గ్రహిస్తే, ఎంత బంగారమైనా మనమే తయారుచేసికోవచ్చు. కాని, పిత్తలిని హాటకం చేయడం నేర్పుతామని చెప్పి నమ్మించి చాలా పితలాటకము చేసి, బంగారంవంటి గృహస్థులను బంగారు పిచ్చుకలను చేస్తామని ఆశపెట్టి, బంగారం పిచ్చి ఎత్తించి, తమ వెంబడి తిరిగినవారి వెండిని హరించి, వారి జోలి ఖాళీచేసి తమ కంటె జోగులను చేసిన యోగు లున్నారు. అందువల్లనే యీ యోగశాస్త్ర మహిమలను యోగ్యులైనవారు



"అసలు రహస్యం చెప్పనా?—
ఈ పెద్దవాళ్లంతా చెప్పనాతు లే!"

ఫోటో ఎస్. కామేశ్వరరావు (రాజమండ్రి)

## బొమ్మరిల్లు కొత్త సీరియల్

రాబర్ట్ లూయీ స్టీవెన్సన్ రచించిన

## డాక్టర్ జెకిల్ ఎండ్ మిస్టర్ హైడ్

**(Dr. JEKYLL & Mr. HYDE)**

ఆంధ్రానువాదం ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రికలో త్వరలో సీరియల్‌గా ప్రచురింపబడనున్నదని తెలుప సంతసించుచున్నాము.

—సంపాదకుడు.



తాతా మనవలు

ఫోటో : ఎస్. వి. కృష్ణారావు (కైకలూరు)

బుంగమూతి పెట్టుకుని కిశోర్ తండ్రివున్న గదిలో కొచ్చాడు.

"నాన్నా, సిరా చాలా ఖరీదైనదా?" అని అడిగాడు.

"కాదు. ఏం, ఎందుకూ?"

"మరి మనకొత్త తివాసీ మీద కాస్త సిరా ఒలకపోసి నందుకే అమ్మతిట్టిందేం?''

# ★ కాలక్షేపం

అణుమాత్రమైనా గణుతింపక యోగవిద్యల గౌరవమువమ్ము చుమ్ము అని నమ్మండి మున్నాటికీ అన్నారు. "పరకాయ ప్రవేశాదివిద్య లెల్ల" పరతత్వమును చూపించగల్గినవి కావు అని శ్రీ త్యాగరాజులవారు తృణీకరించి నారు.

యోగవిద్యలన్నీ నిజమే అని నిర్ణయించి నప్పటికీ, అపారమైన జప తప మంత్రోపాసనవల్లనూ, జితేంద్రియత్వం వల్లనూ, సాధించవలసి ఉంటుంది. దివ్యదృష్టి అనేది ఒక అత్యద్భుతమైన యోగశక్తి. అటువంటి శక్తిని సంపాదిస్తే ఏమిటి లాభం? ఎంతైనా లాభం ఉంది. ఆవకాయ జాడీమూత తీయకుండానే, జాడీలో యింకా ఎంతవరకు ఆవకాయఉన్నదో అవలీలగా చెప్పవచ్చు. ఎవని మనీపర్సులో ఎంత పైకం ఉన్నదో, జేబులోనుంచి గైర్విలియా చేయకపూర్వమే విలియా చూడవచ్చు. పరీక్షహాలులోనికి వెళ్లకపూర్వమే ఎంత కఠినమైన ప్రశ్నలు పరీక్షాపత్రంలో అచ్చొత్తింప బడినప్పటికీ, ఎవరికీ అందకుండా, ఏ విద్యార్థితోనూ మాట్లాడకుండా పరీక్షిన్మహారాజు లాగున పరీక్షాధికారి ఒంటిస్తంభం మేడమీద కూర్చుండినప్పటికీ, ఆ ప్రశ్నాపత్రంలోని ప్రశ్నలను దివ్యదృష్టిగల విద్యార్థులకు విశదమవుతూ ఉండడం విశ్వవిద్యాలయాధికారులకు విస్మయంగా అయోమయంగా ఉండడం, అనేకపర్యాయములు యీ ఆధునిక యుగంలో ప్రత్యక్ష ప్రమాణంగా నిజ నిదర్శనమైంది.

ఇది దివ్యదృష్టియని విద్యాధికార్లు అంగీకరించారు నిజమే. కాని, యిదికూడా ఒక విద్యయని విధిగా అంగీకరించవలసిన అగత్యం ఉంది. పోలీసు శాఖలో ప్రవీణుడు కావాలంటే, అనుమానాల ఆధారాలనుబట్టి ఆ చూకీ తీయడం, మనిషి వర్చస్సును చూచి మనస్సును గ్రహించడమూ యీ విధమైన పరిశోధకవిద్యను స్కాట్లండు దేశానికికూడా వీలైతే వెళ్ళి Scotland yard లో (స్కాట్లండుశిక్షణా శిబిరంలో) సాధకం చేసి సిద్ధహస్తుడు కావాలి. యుద్ధతంత్రంలో గూఢచారులను తర్ఫీయతు చేయుటకుగాను జర్మనీలో యిదివరలో కొన్ని కాలేజీలను హిట్లరు ఏర్పాటు చేయించాడు. ఎటువంటి రహస్య తంత్రమునైనా చిదంబర రహస్యం చేయగల వేగులవాండ్లు ఆ యుద్ధకాలంలో ఉండే వారు. 1942 సం॥లో మద్రాసు నగరమునకు జపాను విమానదాడుల తుపాను వస్తుందనే భయంతో మద్రాసును ఖాళీచేసి లక్షల కొలది జనులు రైళ్లెక్కి పొరుగూళ్ళకు వెళ్లిపోయిన వార్త ఆమరునాడే జపాను రేడియోలో టోకియో నగరంనుంచి వెల్లడించారు. మదరాసు సెంట్రలు స్టేషనులో రైల్వే వారికి లభించిన రొక్కం లెక్కకూడా జపాను రేడియో దివ్యదృష్టితో చెప్పడం

"అమ్మా, జూ లోకి కొత్తగా పెద్దపులి వచ్చిందట్, పోయి చూసి రావద్దూ?"

"అదేమిట్రా, జూకి పోతానంటావ్, ఇంటికి రాకరాక మీ రమణమ్మత్త వస్తేను?"



పసివాని మనసు

కె. భాగేశ్వరశర్మ (బాఫ్నా)

ఆనాటి జపాను సమరయోగ విద్యగా చోద్యంగా ఉంది. ఆస్ట్రేలియా ప్రభుత్వ సైనికాధికార శాఖవారు రహస్యంగా తయారుచేసిన యుద్ధ పథకములను సీలుచేసి చాలా రహస్యంగా ఉంచుకొనియుండగా, జపాను రేడియోవారు ఆ రహస్యమును ఆకాశవాణి వెల్లడించినట్లుగా, టోకియో రేడియో టూకీగా చెప్పివేసింది. ఆస్ట్రేలియా ప్రభుత్వం "ఆశ్చర్యం! ఆశ్చర్యం!" అంది.

ఇంతటి యోగవిద్యా ప్రౌఢ గూఢచారులతో పరరాజ్యాల ప్లానులను జపాను సంగ్రహించి సంగ్రామం సాగించింది. కాని, తనమీదకు అమెరికావారు ఆటంబాంబులను ప్రయోగిస్తారనే సంగతి గ్రహించలేకపోయింది. తనవద్ద నొక రహస్యాయుధము ఉన్నదని హిట్లరు యుద్ధ ప్రారంభంనుంచీ ప్రగల్భము లాడెను. ఆ రహస్యాయుధం ఆటంబాంబు. ఈ ఆటంబాంబు రహస్యం అమెరికావారిచేతికి వాటంగా చిక్కింది. అమెరికావారుకూడా తమ ఆటంబాంబు ఫ్యాక్టరీల కవాటం బంధించారు. వారు ఆ కవాటంబులకు సీసం కరిగించి సీళ్లువేసినప్పటికీ, వారు ఏ శిష్యులకూ ఉపదేశించకపోయినప్పటికీ, రష్యాలోకూడా పరమాణురహస్యం ప్రవీణులచేతిలో పరిపక్వమై ఉదజనిబాంబులుకూడా బుద్బుదములవలె ఉద్భవిస్తున్నాయి.

ఇటువంటి పరమాణు సంయోగ రహస్యం పరమరహస్యంగా ఉన్నదంటే అపహాస్యంగా ఉంది. రహస్యమైనవిద్యకూ చీకటి వ్యాపారానికీ విభేదం విశేషంలేదు. అందువల్లనే ఆనాటి యోగవిద్యలు మాయవిద్యలై మటుమాయమైలుమైపోయినాయి. లోకోపకారార్థమైన విద్యకు శిల ఊడిపోయి అదిలోకాపకారార్థ విద్య అయితే, ప్రపంచం ప్రచండం అవుతుంది. దేశానికీ దేశానికీ మధ్య తగాదాలు తామరతంపర లవుతాయి. ఒంచిన్ని కాలువ సరిహద్దుగా ఉన్నప్పటికీ అది ఒక పెద్ద సముద్రమువలె దాటరానిది అవుతుంది. కాని, పరస్పరంగా పరోపకారచింతతో ప్రపంచం మంచిగాఉంటే దేశాలకూ దేశాలకూ మధ్య మహాసముద్రాలు అడ్డమున్నప్పటికీ చిన్న కాల్వమాత్రమే అడ్డమున్నట్లుగా కలిసిమెలసి ఉంటారు. జాతికీ జాతికీ మధ్య అతుకుపెట్టడిశీల వారి సౌశీల్యమే. అటువంటి సౌశీల్యం ఉన్నటువంటివారికి శత్రువు మిత్రుడవుతాడు. అటువంటి వారికి ఆటంబాంబులు అనవసరం అని, రాటం తిప్పుతూ బాహాటంగా చెప్పినవాడు మహాత్ముడు.

అతనికి వార్ధి కుల్య యగు,
వగ్ని జలం బగు; మేరుశైల మంచిత శిలలీల నుండు; మద
సింహము జింక తెఱంగు దాల్చు; గోపిత ఫణి పూలదండ యగు;
భీష్మ విషంబు సుధారసం బగున్;
క్షితి జన సమ్మతంబగు
సుశీల మ దెవ్వనియందు శోభిలున్.

★

# ఘంటికారావం

## (THE HUNCHBACK OF NOTRE DAME)

విక్టర్ హ్యూగో



 

# ఘంటారావం



నేటివరకూ ఫ్రాన్స్ దేశాన్ని పరిపాలించిన మహారాజుల చిత్రాలూ శిల్పాలూ అలంకరించబడి ఉన్నాయి. కిటికీల తలుపులు ఊర్ధ్వ గవాక్ష ఫలకాలు అనేక వర్ణాలలో మెరిసిపోతున్నాయి. మందిర కుడ్యాలు, చిత్రాలు, స్తంభాలు అన్నీ స్వర్ణనీల వర్ణాలలో మేళవించబడినాయి.

ఆనాడు విభ్రాంతి కలిగించిన ఈ మహామందిరం నేడు (రచయిత జీవితకాలానికి, అనగా 19 వ శతాబ్దానికి) లేదు. 1618 లో ఇది దగ్ధమైపోయింది. ఇందుకు కారణం నాలుగో హెన్రీ హత్య. ఆ హత్య జరిగివుండకపోతే, హత్యా నేరవిచారణకు సంబంధించిన పత్రాలు ఈ మందిరంలో పదిలపరచవలసిన అవసరం లేకపోయేది. అవి ఇక్కడే పదిలపరిచినందువల్ల ఆ పత్రాలను నాశనం చేయగోరిన వారు 1618 లో మందిరాన్నే అగ్నికాహుతి చేశారు. "అడుగు వెడల్పు, అడుగున్నర పొడవూకల ఒక అగ్నిశిఖ ఆకాశాన్ని చీల్చుకొని వచ్చిపడింద"ని, అందువల్ల మందిరం దగ్ధమైపోయిందని కొందరంటారు. ఏమైతేనేం, ఇప్పుడు ఆ మందిరం లేదు. తిరిగి దాన్ని పునరుద్ధరించడానికి అనేక యత్నాలు జరిగాయి. కాని పూర్వశోభను ఎవరూ పునరుద్ధరించలేకపోయారు. మందిరంతోపాటు చరిత్ర ఘట్టాలను జ్ఞప్తికి తెచ్చే అనేక శిల్పాలు, వేదికలు ఇప్పుడు లుప్తమైపోయినాయి.

చతురశ్రాకారం కల ఈ మందిరంలో ఒక చివర పెద్ద పాలరాతితిన్నె ఉంది. ఇది ఏకశిలాఖండం. మరొక చివరగోడ నానుకుని ఎత్తుగ కట్టిన ఒక పెద్దవేదిక ఉంది. ఈ వేదికకు వెనుక చిన్నద్వారం. ఈ ద్వారంగుండానే అతిథులువచ్చి వేదిక నలంకరిస్తారు.

పాలరాతి తిన్నెపై నాటకప్రదర్శనం జరుగుతుంది. తిన్నె వెనుకభాగంలో చెక్కలతో కట్టి పరదాలతో కప్పి చిన్నగది ఒకటి తయారుచేశారు. ఎత్తైన ముందుభాగం రంగస్థలం. గదిలోనుంచి రంగస్థలానికి రాకపోకలుమాత్రం బహిరంగమే. మధ్య నిచ్చెన వెయ్యబడి ఉంది.

పన్నెండుగంటలకుగాని నాటకం ప్రారంభం కాదు. రాయబారులరాక ఆలస్యమౌతుంది. అందువల్ల జాప్యం జరుగుతుంది.

మందిరంలో చేరిన వేలాది ప్రజలు ఉదయంనుంచి వేచివున్నారు. కొందరు తెల్లవారకముందే చలిలో గజగజలాడుతూ వచ్చి మందిర ప్రాంగణంలో కాచుకున్నారు. క్షణక్షణానికీ సమూహం పెరుగుతూనేవుంది; జరుగుతున్న జాప్యానికి ప్రజల విసుగుదల హెచ్చుతూవుంది. సహనం తగ్గి తగవు లెక్కువ కాసాగినాయి. అల్లరి పెరుగుతూ వుంది. మధ్యమధ్య అందరూ పొలికేకలు పెడుతున్నారు. ఫ్లాండర్స్ రాయబారులపట్ల దూషణతిరస్కారాలు వినరాసాగినాయి. మధ్యమధ్య నడయాడుతున్న విద్యావంతులు నిరసనతో నవ్వుతున్నారు. సామాన్యజనం మొరటుహాస్యాలను విసురుతున్నారు. ఒకడు ఒక కిటికీ నెక్కి గాజుతలుపు బ్రద్దలుకొట్టి సుఖాసనం ఏర్పరచుకున్నాడు. అతడిని చూసి మరికొందరు కిటికీల నెక్కారు. కిటికీల నెక్కినవారు ఇటు మందిరంలోనివారితోనూ, అటు ప్రాంగణంలో నిలిచిపోయినవారితోనూ నవ్వుతూ పేలుతూ సంభాషణ సాగిస్తున్నారు.

"ఓహో నువ్వెప్పుడొచ్చావోయ్! కాళ్ళు ఎక్కడానించావ్ ?"

"అబ్బ! నాలుగు గంటలనించి నిలబడుతున్నానిక్కడ. నా పాదాలు దేనిమీద ఆనుకున్నాయో నా కిప్పుడు తెలియడంలేదు."

"కిందటి తడవ నాటకం మీరు చూశారా? అందులో పాటలెంత చక్కగా ఉన్నాయి!"

"అవునవును. రాజుగారు డబ్బు సంచులు దిమ్మరించారు."

"అవును. డబ్బు దిమ్మరించ కేంచేస్తారు? మన సొమ్ము..."

"దైవప్రార్థనకోసం వేలు గుమ్మరించలేదా?"

"వేలు గుమ్మరించకపోతే రాజుగారి ఆరోగ్యం ఎల్లా కాపాడ్డం?"

పకాలున కొందరు వినగబడి నవ్వారు.

ఇలాగ ప్రసంగాలు సాగుతున్నాయి. ఇంతలో అతికాయుడైన ఒకడు ముఖమల్ దుస్తులు ధరించి తచ్చాడుతూ కనపడగానే కొందరు చేతులెత్తి చూపుతూ గేలిచేశారు. అతడు తప్పించుకుని గుంపులో కలిసిపోయాడు.

"అబ్బబ్బ! చదువుకున్నవాళ్లుకూడా అందరితో సమానంగా పేలిపోతున్నారే."

"ఓ హో హో" అంటూ జనం పగలబడ్డారు.

తిన్నెవద్ద బ్యాండ్ మోగింది.

"ఎవరో"

"పుస్తకాలమ్మే వాళ్లు"

"వీళ్ళ పుస్తకాలు తగలబెట్ట"

"నోరుముయ్యండి"

"ఛక్"

కోలాహలం మితిమీరుతోంది.

"ఇవాళకూడా ఈ మంత్రాలేనా?"

"మన పండుగరోజునకూడా వీళ్ళ గొడవేమిటి—తన్ని తగిలెయ్యక."

"బల్లలన్నీ పోగుచేసి చలిమంట పెట్టాలి"

"పిదపకాలం వొచ్చింది"

"అడుగో ఫాదరీ"

"రాత్రి ఎన్ని బుడ్లు ఖాళీచేశాడో"

"జూదంలో ఎంత కడిగేసుకున్నాడో."

"ఫిరంగులు పుట్టాయి ఇంకా లోకమేమిటి! అంతానికి వొచ్చింది."

గడియారం పన్నెండు కొట్టింది. అంతటా నిశ్శబ్దం ఆవరించింది.

అందరి తలలూ సింహద్వారంవైపు తిరిగాయి. తరవాత అతిథుల వేదికవైపు చూశారు. అక్కడ ద్వారం మూసేవుంది. వేదిక నిర్జనంగానే ఉంది. రంగస్థలంకూడా ఖాళీగా ఉంది. ఇంక ప్రజలకు ఓర్పు నశించింది. "నాటకం! నాటకం!" అని కేకలు వేయ నారంభించారు.

"సిపాయిని తన్నండి ముందు" అన్నారు కొందరు.

"అవును. పట్టుకోండి. ముందు కాపలావారల పని పట్టించండి."

ఘోష మిన్ను ముట్టింది. కాపలాదార్లు ప్రాణభయంతో గోడలమూల నక్కారు.

ఇంతలో రంగస్థలంవద్ద చలనం కలిగింది. తెర తొలగించుకుని ఒకడు రంగస్థలంమీదికి వచ్చి నిలబడ్డాడు. మళ్ళ మందిరంలో నిశ్శబ్దం ఆవరించింది. రంగస్థలంపైన నిలిచిన పురుషుడు గజగజ వణుకుతూ వొంగివొంగి ప్రేక్షకులను అభివాదం చేశాడు. ముఖానికి తగని పెద్దగడ్డం, గడ్డం మూసివేయగా మిగిలిన ముఖంలో

ఎర్రనిరంగూ, జూపిటర్ వేషం చూసేసరికి ప్రజలు ప్రశాంతులైనారు. సిపాయిల ప్రాణాలు దక్కాయి.

## 2

వేషం చూడగానే తృప్తిచెందిన జనానికి అతడి మాటలు వినేసరికి తిరిగి ఆవేశం పుట్టింది. "రాయబారులు రాగానే నాటకం ప్రారంభమౌతుంది" అని అతడు ప్రకటించాడు.

"వీల్లేదు. వెంటనే మొదలెట్టాలి" అని కేకలు చెలరేగాయి.

"జూపిటర్‌ని దిగలాగండి. తన్నండి" అని కేకలు వేశారు. జూపిటర్ వేషధారి భయంవల్ల తడబడ్డాడు. ఏమి చెప్పాలో తోచలేదు. నాటకం ప్రారంభించకపోతే ప్రజలు చీరేస్తారు; ప్రారంభిస్తే కార్డినల్ క్షమించడు.

ఇంతలో ఒకడు రంగస్థలాన్ని సమీపించి వేషధారిని పిలిచాడు.

"జూపిటర్ నాటకం మొదలెట్టు. కార్డినల్ కోపగించకుండా నేను చూస్తాను. భయంలేదు. జనం కోరిక మన్నించి మొదలుపెట్టు" అని బిగ్గరగా చెప్పాడు. వేషధారి ఒక్క నిశ్వాసం విడిచి "అయితే నాటకం ప్రారంభమౌతుంది" అని ప్రకటించాడు. వెంటనే మందిరమంతటా చప్పట్లు మారుమ్రోగాయి. వేషధారి పరదాలోకి తప్పుకున్నాడు.

ముందుకువచ్చిన పురుషుడు తెర్నకింద నిలబడి జనాన్ని కలయచూశాడు. ముందు బల్లలవద్ద కూర్చున్నవారు అతని వంక చూసి ఏదో మాట్లాడుతున్నారు. అది గమనించి అతడు మెల్లిగా వారిని సమీపించాడు. ఇద్దరు స్త్రీలు మాట్లాడుతున్నారు.

"ఈ నాటకం కథేమిటో."

"జూపిటర్ వేషం వొచ్చిందిగా, ఏదో గ్రీక్ దేవతలకి సంబంధించిన కథ కాబోలు."

"నిరుడు వేసిన నాటకం బాగుంది."

అతడు ధైర్యంచేసి మాట కలిపాడు "ఇది కూడా బాగుంటుంది."

"నిజంగా?"

"అవునండి. ఇదో కొత్తరకం నాటకం. బలేగా ఉంటుంది"

"ఇందులో ప్రేమపాట లుంటాయా?"

"అబ్బే! అలాటిది కాదు. ఇది నీతి బోధిస్తుంది.

"ఇంతే!"

"అయితేం! బాగుంటుంది. ఇది నేనే రచించాను"

"ఆ!" ఇద్దరు స్త్రీలూ ఒక్కసారి అన్నారు ఆశ్చర్యంతో. కవీశ్వరుడు వెన్ను విరుచుకుని ఒక్కసారి చూశాడు.

"మీ పేరు?"

"పీర్ గ్రింగైర్"

జూపిటర్ పరదాలోకి తప్పుకుని ఇంకా రాలేదు. ఇంతకు ముందే నాటకంకోసం అల్లరిచేసినజనం ప్రారంభమౌతుందని తోచేసరికి కిమ్మనకుండా ఊరుకున్నారు. కాని ఎంతసే పూరుకుంటారు. మళ్ళీ అక్కడక్కడ కొందరు కేక లారంభించారు. "జూపిటర్! తెరగొత్తి ఊడిపడవోయ్" అని అరుస్తున్నారు.

"నాటకం! నాటకం" అని మళ్లీ కేక లారంభంకావడంతో వెంటనే తెర లేచింది. రంగులు పూసుకొని నలుగురు పరదాలోనించి వచ్చారు. వరుసగా నిలబడి ప్రేక్షకులకు వొంగి వొంగి అభివాదం చేశారు. ప్రజలు హర్షధ్వానం చేశారు.

వెనుకనుంచి వాద్యసంగీతం ఆగిపోయింది. నాటకం ప్రారంభమయింది. నటులు నాందికి ఉపక్రమించారు. కాని వినేదెవరు? అందరికీ వారి దుస్తులపైనే దృష్టి. నలుగురి దుస్తులూ సగం తెలుపురంగులోనూ సగం పసుపు పచ్చని రంగులోనూ ఉన్నాయి. అయితే ఒకరి దుస్తులనిండా బ్రొకేడ్ అలంకరణ ఉంది. ఒకరిదుస్తులు పట్టువి. ఒకరివి ఉన్ని దుస్తులు. మరొకరివి లినెన్‌తో తయారైనవి. ఇద్దరుస్త్రీలు, ఇద్దరు పురుషులు. ఒకరి కుడిచేతిలో కత్తి, ఒకరిచేతిలో బంగారు తాళపు చెవులగుత్తి, మరొకరిచేతిలో త్రాసు, ఇంకొకరి చేతిలో త్రవ్వుపార ఉన్నాయి. ఇంకా ఎవరి దేవేషమో బోధపడకపోవచ్చునని కాబోలు వారివారి దుస్తులపైన ఇలా పెద్దపెద్ద అక్షరాలు కుట్టించుకున్నారు: "నాపేరు సామంతరాజరికం," "నాపేరు మత ప్రచారం," "నాపేరు వాణిజ్యం," "నాపేరు కృషి." మతం, కృషి పురుషులు; రాజరికం, వాణిజ్యం స్త్రీలు. పురుషుల దుస్తులు మోకాటివరకున్నాయి. స్త్రీలదుస్తులు పాదాలనంటుతున్నాయి. వాణిజ్యంతో కృషి, మతప్రచారంతో రాజరికం చేతులుకలిపి ప్రస్తావన పలుకుతున్నారు. నలుగురి మధ్యా ఒక 'బంగారు చేప' ఉంది. భువిలోకెల్ల సుందరిఅయిన యువతి కీ 'బంగారు చేప'ను బహూకరించాలని వారి ఆశయం. నలుగురూ విశ్వమంతా చుట్టి భువనసుందరికోసం గాలిస్తున్నారు. దేశదేశాల రాకుమార్తెలు, సుందరీమణులు వచ్చారు; కాని వా రెవ్వరూ నచ్చలేదు. చివరకు విసిగి వేసారి, అలసిపోయి నలుగురూ ఒకచోట విశ్రాంతి తీసుకుంటున్నారు.

కథ నడక బాగానేవుంది. కవిత, ప్రసంగవిధానం, ఉత్ప్రేక్షలు, అలంకారాలు ప్రవాహంలా దొర్లిపోతున్నాయి. అయితే ప్రేక్షక సమూహంఅంతలోకీ గ్రింగైర్ చూపుతున్నంత శ్రద్ధ మరెవ్వరికీ లేకపోయింది. కన్నార్పక చూసి చెవులొగ్గి తదేకంగా ఆలకిస్తున్నాడు. నాటకారంభంలో ప్రేక్షకుల హర్షధ్వానాలు అతడి చెవులలో మార్రోగుతున్నాయి. నటీనటుల పలుకులలో తనభావాలు మందిరమంతటా వ్యాపించడం చూసేసరికి కవీశ్వరుడు తన్మయుడౌతున్నాడు.

కాని కవీశ్వరుని తన్మయానందం ఆట్టేసేపు నిలవలేదు. ఒక బికారి గుంపులోనుంచి చెదిరివచ్చి అతిథుల వేదిక పీఠానికి క్రింద వ్రేలాడుతున్న ఒకానొక శిల్పవిశేషంపై సెక్కి కూర్చున్నాడు. కూర్చుని ప్రేక్షకుల తలలమీదనుంచి చేతులుచాపి "అయ్యా భిక్షం, బాబూ భిక్షం" అని అరువ నారంభించాడు. కవీశ్వరుని కవిత్వ సౌందర్యం గ్రహించలేక నటులవైపు చూస్తోన్న ప్రేక్షకుల దృష్టి బికారివైపు మళ్లింది. నటీనటుల ప్రసంగం నిలిచిపోయింది. బికారిని చూసి ప్రేక్షకులు నవ్వ నారంభించారు. పక్షి సంతతి గుమిగూడిన వృక్షంపైకి తుపాకి పేల్చినట్లయితే సంభవించే కల్లోలం చూసినవారికి ఇప్పుడా మందిరంలో పరిస్థితి సులువుగా బోధపడుతుంది.

"అరె వీడీమాటు చేతికి కట్టుకట్టాడే."

"నిన్న కాలికి తగిలినదెబ్బ ఇవాళ చేతిమీది కెక్కిందోయ్."

ఈరీతిగా కొనసాగిన ప్రసంగాలలో అందరూ నాటకాన్ని మరిచిపోయారు. ఒక డొక కాసు విలాసంగా పైకి విసిరాడు. కట్టుకట్టుకున్న చేతితోనే బికారి నేర్పుగా అందుకున్నాడు.

కవీశ్వరుడు ఇంతలో తేరుకున్నాడు. "ఎందు కాపడం? కానివ్వండి" అని బిగ్గరగా అరిచి నటులకు సౌజ్ఞ చేశాడు. నటులు ఈసూరు గొంతుచించుకుని 'చదువ' నారంభించారు. కవి నెవరో భుజం తట్టినట్లయింది. వెనుతిరిగి చూశాడు.

"ఇంకావుందా నాటకం?"

"అయిపోయిందా?"

కవికి రోషం వచ్చింది. పళ్లు పటపట కొరికాడు. నటుల

(53-వ పేజీ చూడండి)

# చెదిరిన చీకట్లు

ఆసాయంత్రం రామారావు చాలా హుషారుగా నడిచి వస్తున్నాడు. గుప్పుగుప్పుమని సిగరెట్టుపొగ అతని పెదవులని చీల్చుకు వస్తోంది సీమ్ ఎంజిన్‌లా. ఆ స్నిగ్ధమేఘాలలో ఏవో నీలాల మేడలు ప్రస్ఫుటంగా ప్రతిబింబిస్తున్నాయి. అతని సుకుమార దక్షిణహస్తంలో విన్నాణమైన కోయంబత్తూరు చీర మిలమిలా మెరుస్తోంది అప్పుడే వెలిగిన విద్యుద్దీపాల మసక కాంతిలో.

ఆనాడు అతను సాధించిన ఘనవిజయం ...తన అర్థాంగ లక్ష్మికి...శశికి ... ఒకచీర కొనడం. అదేమంత పెద్దవిషయం కాక పోవచ్చు కొంతమందికి. కాని అతనికి మాత్రం చాలా పెద్దవిషయమే.

ఒక చిన్న పట్టణంలో...ఒక చిన్న కంపెనీలో - ఒక చిన్న గుమాస్తాగా పనిచేస్తున్నాడు ఆ రామారావ్. అతని కొచ్చే జీతం గూడా...చాలా "చిన్న"దే. అందుచేతే, పది హేనురూపాయలు పెట్టె ఒక చీరకొనడం అతనికి చాలా పెద్దవిషయం ... అప్పటికి శశి కాపరానికివచ్చి నాల్గేళ్ళయినా, తను ఒక్క చీర కొనలేదు. అంతో ఆమె ఇంకో విధంగా గడిపేసింది. శశి తల్లిదండ్రులు కలవారు అవటంవల్లా, వారికి ఒక్క శశితప్ప వేరే ఆడసంతానం లేకపోవుటవల్లా, శశి పుట్టింటికెళ్లినపుడల్లా వలసిన చీరలు తెచ్చుకొనేది. అసలు శశికి ఇంతకన్నా గొప్ప సంబంధమే చేద్దామని తల్లిదండ్రులు అనుకున్నారు. కాని శశి పట్టుదలవల్లనే ఆమెకీ రామారావుకీ పెళ్లయింది. ఇతనికి వచ్చే నలభైఅయిదు రూపాయలతో చాలీచాలని సంసారం ఒడుదుడుకులతో సాగిపోతోంది.

ఇంతకీ! రామారావుకూడా ఒక స్త్రీకి భర్తే! ఆమెను సంతోషపెట్టడం అతనివిధి. కాని అశక్తుడు—తన అశక్తతకి అతడు తనలోతానే చాలా కుమిలిపోయేవాడు. ఇంతేనా...తన బ్రతుకని!

బి. వి. ప్రసాదరావు

ఆఖరుకి నిశ్చయించేడు. ఎలాగైనా తప్పకుండా యీపండగకి ఒకచీరకొనాలని. అయితే యీలక్ష్యం చేరడానికి ఆరునెలలు ముందునుంచి అతను ప్రయత్నం చేశాడంటే—ఆశ్చర్యపడవలసిన అవసరంలేదు. ఈఅయిదేళ్ల వుద్యోగంలోను..అతను ఒక్క కానీకూడా మిగుల్చుకోలేకపోయాడు. ఎప్పుడు చూసినా బాకీలకే చాలేదికాదు ఆ తెచ్చినజీతం.

ఆవిధంగా పది హేనురూపాయలు మిగిల్చి ఒకచీర కొన్నాడంటే...సాంసారిక ఆర్థిక రంగంలో...నిజంగా అతను ఘనవిజయం సాధించాడన్నమాటే. ఇందుకొఅకై ఇతను వేసినన్ని ప్లానులు, అమలుపఅచినన్ని ప్రణాళికలు ఏకేంద్రప్రభుత్వ ఆర్థికమంత్రి కూడా చేసివుండడు.

అతని పెదవులపై చిరునవ్వు వెలిసింది. నుదుటిపై చెమటబిందువులు గాలికి అల్లల్లాడుతున్నాయి. 'నా ప్రయోజకత్వానికి శశి చాలా సంతోషిస్తుంది. అనేకవిధాల అభినందిస్తుంది.' అని వివిధభంగిమలని ఊమరువేస్తూ అతని హృదయం ఉప్పొంగిపోయింది. ఆ హృదయోద్వేగంలో చిన్న కవితాతరంగం లేచింది. అతని కండ్లయెదుట సోమిదేవమ్మను తలచుకుంటున్న ప్రవరాఖ్యుడు ప్రత్యక్షమయ్యాడు. పట్టలేని ఆవేశం పరుగులు వారింది.

"అనుకూలవతి నాదు మనసులో వర్తించు
శశిబాల మది యెంత సంతసించు"

అని ఒక చిన్న కూనిరాగం కూడా తీశాడు.

మెల్లిగా పార్కు సమీపించాడు. చల్లని మలయమారుతం పువ్వులచెట్లమీదుగా కమ్మగా వీస్తోంది. ఆలిండియా రేడియో విజయవాడ కేంద్రంవారి రికార్డు సంగీతం చాలా హాయిగా వినిపిస్తోంది.

"ఇదా మన దేశం

ఇదా భరతదేశం"

చాలా *high style* లో పోతోంది ఆ స్వరం...

కాళ్ళు వేగం తగ్గించి మెల్లగా నడవ ప్రారంభించాయి. మెదడు ఆ మృదుమధుర సంగీతాన్ని ఆస్వాదిస్తూ మైమఱచింది.

అయితే ఆనందంకూడా మెఱుపులాంటిదే. ఇట్టే వచ్చి మఱుక్షణంలోనే మాయమైపోతుంది. అతని చూపులు హఠాత్తుగా ఎదురుగా వస్తున్న వ్యక్తిపై పడ్డాయి. మొగం ముచ్చెమటలు పోసింది. గొంతుక ఆరిపోయి నాలుక బయటికి వచ్చేసింది. అతనే, ఆ వ్యక్తి - బ్లూ - బ్లేక్ బుష్ కోటు...తెల్లటి ఫాంటూ, పొడుగాటి కోరమీసం, చేతిలో కఱ్ఱ.. మెడలో నెక్‌టై...అతనే ఆ నీలకంఠరావు-కంపెనీ మేనేజరు...*Sweet - heart* తో సహా. పార్కులో విహారయాత్రకు వస్తున్నాడు.

రామారావు నోటిలో సిగరెట్ 'టపీ' మని క్రిందపడిపోయింది. అతని చేతిలోని చీర గజగజా వణికింది. తప్పించుకుని చూసీ చూడనటు పోవడానికి కూడా వీలులేదు. అతను చాలా దగ్గరగా వచ్చాడు.

గత్యంతరం లేక, రామారావు, లేనిచిరునవ్వు తెచ్చుకుని మేనేజరుగారికి సెల్యూట్ చేశాడు.

ఆ మేనేజరు గారు కూడా (ఇదివరకే చీరని పసికట్టియున్నారు కాబట్టి) అమం

దాంచన కందళిత హృదయారవిందుడై ఆ వందనాన్ని స్వీకరించి

"ఎక్కడనుంచోయ్! రామారావ్" అన్నాడు ఆప్యాయంగా.

"అహఁ! ఇక్కడనుంచేనండి! బజారు నుంచి" అని నసిగాడు రామారావు.

మేనేజరుగారు ఆగకుండానే నడిచాడు పార్కు గేటులోకి. ఆయన, ఆయన వెనకాలే సతీమణీ...ఆ వెనకాల రామారావు, ఆ వెనకాల బంట్రోతు...'తన వెంటన్ సిరి, లచ్చి వెంట నవరోధవ్రాతమున్" అన్నట్లుగా ఒకరి ప్రక్కగా నొకరు పార్కులోకి ప్రవేశించారు. రామారావుకి కూడా తప్పదు మరి! మేనేజరన్న తరువాత ఎక్కడైనా మేనేజరే!

మేనేజరుగారు తిన్నగా వెళ్ళి ఒక పాలరాతి బెంచీమీద కూర్చున్నారు. ఆ ప్రక్కనే సతీమణి మనోరమాదేవి ఆసీనురాలయింది.

రామారావు మాత్రం అలాగే నించున్నాడు. ఆ ప్రక్కనే బంట్రోతు. అనగా అక్కడ ఒక చిన్న ఆఫీసు వాతావరణం ఏర్పడింది.

రామారావు నించున్నాడే గాని అతని బుఱ గిరగిరా తిరిగిపోతోంది. కళ్లు చీకట్లు క్రమ్మాయి. మనస్సు మనస్సులో లేదు. పగిలిపోయిన పాలకుండలా అతని ఆలోచనలు జారిపోతున్నాయి. నిజంగా యీ దుర్మార్గుడు కనుక యీ చీర బాగుందంటే...గట్టిగా...తను ఇవ్వనన లేడు...ఇవ్వక తప్పదు. అయితే తన యీ ఆరు నెలల కష్టమూ వృథాయేనా? 'కష్టే ఫలీ' అంటారు ఏమిటో!

అసలు దీనికి తను కూడా కొంత కారణమే. బజారునుంచి తిన్నగా ప్రక్క చూపులు చూడక ఇంటికి పోక - యీ పార్కుదగ్గర ఆగిపోవడ మేమిటి! ఆగితే ఆగాడు...అంత మైమరచి సంగీతాన్ని వినడమేమిటి! ముందు ఏం వస్తోందో చూసికోనక్కరలేదూ! చాలా దూరాన్నుంచే పసిగట్టి ఏ ప్రక్క సందులోంచో మళ్ళిపోతే ఇంత అఘాయిత్యం జరక్కపోను. ఇంతకీ అతి సంతోషంలో కొన్ని తెలివితక్కువ పనులు చేయడం తనవంటి దౌర్భాగ్యుల ప్రత్యేక లక్షణం.

అనుకున్నటుగానే అయింది. మేనేజరు గారు సాదరంగా రామారావుని అవలోకించి

"ఏమిటోయ్! బజారులో విశేషాలు" అన్నాడు.

"ఏదో ఒక చిన్న చీర కొన్నానండి... అంతే" అన్నాడు. అని అతి ప్రయత్నం మీద ఆ చీరని ఆయన చేతుల్లో పెట్టాడు.

లైటు స్తంభపుకాంతిలో ఆయన ఆ చీర ఇటు అటు త్రిప్పి పరీక్ష చెయ్యడం మొదలెట్టాడు. ప్రక్కనే వున్న శ్రీమతి కూడా పరీక్షించడం మొదలెటింది. ఆమె ముఖం విప్పారింది. రామారావు ముఖం ముడుచుకుపోయింది. ఆమె క్రీగంటి చూపులతో భర్తను గిలిగింతలు పెట్టింది. అవి రామారావుని తేళ్లు జెఱ్ఱులులా వంటి నిండా కుట్టేశాయి. వారిద్దరి చేతుల్లోను ఆచీర నలుగుతూవుంటే రామారావు గిలగిలా కొట్టుకున్నాడు గేలానికి తగులుకున్న చేపలా.

ప్రక్కనే నించున్న బంట్రోతుఆసామీ వెంకన్న రామారావ్ ముఖలకుణాలన్నీ వీక్షిస్తూనే వున్నాడు. అతని అయోమయ పరిస్థితిని చూసి చాలా విచారపడ్డాడు. అతనికి బాగా తెలుసు రామారావు ఇంటి పరిస్థితి. నిజంగా ఆచీర కొన్నాడంటే చాలా ఆశ్చర్యపడ్డాడు. ఎలా కొనగలిగాడా! అని. అయితే రామారావునీతి... నిజాయితులవిషయంలో శంకించవలసిన అవసరంలేదు. ఆఫీసులో అందరికి అతను తలలో నాలికవంటివాడే. అతని చెయ్యి బల్లక్రిందకు పోవడం వెంకన్న ఎప్పుడూ చూసి యెఱగడు.

ఇక మేనేజరు నీలకంఠరావుగారివిషయం మాత్రం అందరికీ తెలిసిందే. ఆయన అఖండ ప్రజ్ఞావంతుడు. అటుపై యజమానులను సంతృప్తిపఱచటంలోను ఇటుక్రింది వుద్యోగులపై అధికారం చెలాయించటంలోను ఆయనకి ఆయనే సాటి. ఆయన తలుచుకొంటే— ఎవరిఉద్యోగమేనా...ఇట్టేవూడిపోగలదు. ఆయన అద్వితీయకల్పనాశాలి ... అమోఘ సంపాదనాపరుడు. అందుచేత ఆయనకు ఎవరూ ఎదురు చెప్ప సాహసించరు.

బంట్రోతు వెంకన్న మెల్లిగా రామారావుని ప్రక్కకి పిలిచి ఏదో చెవిలో గొణిగాడు. మేనేజరు దంపతులు చీర పరీక్షలో నిమగ్నులై వున్నారు.

రామారావు పెదవులపై అకస్మాత్తుగా చిరునవ్వు వెలసింది. "హరి! భగవంతుడా! ఈబంట్రోతు బుఱ్ఱలో ఎంత గొప్ప ఆలో

(56-వ పేజీ చూడండి)

# రచయితలకు మనవి

**మాకు కథలు, గేయాలు, చిత్రాలు, ఫోటోలు పంపేవారు ఈ క్రింది అంశాలను గమనించ ప్రార్థన.**

ప్రచురించని వానిని త్రిప్పిపంపగోరే వారు బుక్‌పోస్టుకు అవసరమైన స్టాంపులను, రచనలూ, చిత్రాలూ, ఫోటోలుతోనే చేర్చిపంపాలి.

బుక్ పోస్టుకు అణా స్టాంపుకు తక్కువ కాకుండా పంపాలి.

రచనలను కాయితానికి ఒకే వైపున సిరాతో వ్రాసిపంపాలి.

ఫోటోలు కనీసం కార్డు సైజులో వుండాలి. నెగటివ్‌లు స్వీకరించబడవు.

చిత్రాలు ఇండియన్ ఇంకుతో వేసిపంపాలి. రంగుల చిత్రాలు స్వీకరించబడవు.

ప్రచురణ విషయాన్ని వెంటనే తెలియచెయ్యడం కష్టం.

నిరాకరించబడిన రచనలను త్రిప్పి పంపడానికి మాకు కనీసం ఒక మాసమైనా వ్యవధి అవసరం. ఫోటోలు, చిత్రాల విషయంలో యింకా ఎక్కువ వ్యవధి కావలసివుంటుంది.

ప్రచురించే వానిని గురించి ప్రచురించే ముందు మాత్రమే తెలియపరచగలము.

మాకు పంపిన రచనలను, ఫోటోలను, చిత్రాలను గురించి మా కార్యాలయం నుంచి ఎవ్విధమైన సమాచారమూ అందనిదే వాటి ప్రతులను యితర పత్రికలకు పంపవద్దని ప్రార్థన.

రచయితలూ, చిత్రకారులూ, సహృదయంతో సహకరించగలరని విశ్వసిస్తున్నాము.

—సంపాదకుడు.

# జరీ అంచు తెల్లచీర

జరీఅంచు తెల్లచీర!

విశాలాక్షికి ఏడుపు వస్తోంది.

గదిలో నక్కి మంచంలో కూలబడి చూస్తోంటే, ఎదుట గూట్లో, హరికేన్ లాంతరు గుడ్డి వెలుగులో, ఫిజిక్సు పాఠం చదివేఅన్నయ్యా, పదమూడో ఎక్కంకంఠస్థం చేసే తమ్ముడూ కనిపిస్తూనేఉన్నారు.

రాత్రి తొమ్మిదిగంటలు దాటింది.

వసార వరండాలో నిద్దరపట్టక అమ్మ దొర్లుతోన్నట్టుగా ఉంది. చిన్న తమ్ముడు ముగ్గుముగ్గ ఏడుస్తున్నాడు. అగ్గిపెట్టెకోసం కాబోలు, నాన్న అటూ ఇటూ తిరుగుతున్నాడు.

జరీఅంచు తెల్లచీర!

ఎప్పుడుకొనడం? ఎప్పుడు కట్టుకోడం?

ఏమో! ఎప్పుడో?!

ఎప్పటినుంచో వస్తోన్న ఈతీరని కోరిక ఎప్పుడు తీరుతుంది?

ఎప్పుడో! ఏమో?!

ఎప్పుడో ఒకప్పుడు ఆకోరిక తీరక పోదనేఅనుకొంది.

ఆకోరిక తీరాలనే అనుకొంది ఈనాట కూడా.

కాని, ఆకోరికమాత్రం...

ఈనాటికి పదేళ్ళక్రితం —

ఆరేళ్ళ విశాలాక్షి సినిమాకి వెళ్ళింది.

అది ప్రప్రథమం, సినిమాహాల్లో అడుగు పెట్టడం.

విశాలాక్షి విశాలాక్షయింది.

ఆశ్చర్యం? ఆనందం? కాదు; మైకం!

ఆట ఇంకా ఆరంభం కాలేదు.

ఆరేళ్ళకళ్ళని హాలంతా గిరగిర తిప్పే విశాలాక్షికి, ఆఖరి వరస కుర్చీల్లోకి అప్పుడే వస్తోన్న "ఆవిడ" కనిపించింది.

ఎవరావిడ?

"ఆవిడ"! అంతే.

పాలనురగలా ఉండే [illegible] కట్టుందావిడ.

మందహాసవదన విలాసిని. సుమనోహర హాసిని. శుభ్ర[illegible]అంబరధారిణి.

ఆవిడమనిషి మెల్లగా నడుస్తూవస్తోంటే, ఆవిడ కట్టుకున్న వెన్నెల్లాంటి తెల్లచీర అంచు [illegible] మెరుస్తోంది.

"అమ్మా! నాకలాంటి చీర కొనవే!"

"ఇష్! నోర్ముయ్!"

అంతలో దీపాలుఆర[illegible] తెరమీదబొమ్మలు క[illegible]రిగాయి.

కృష్ణుడిపాట. గోపికలనాట్యం.

తెల్లగా వెలిగేవి గోపికలు కట్టుకున్న తెల్లచీరలు.

తళుక్ తళుక్కు మనేవి ఆచీరల జరీ అంచుల తళుకులు.

సినిమాఅయ్యాక, బైటికివచ్చాక, మళ్ళీ,

"అమ్మా! నాకొక్కటైనా అలాంటి చీరా!?"

"ఇప్పట్నుంచి కోరికలు బావున్నాయే తల్లీ! కొంటాంలే నీ పెళ్ళినాడు"

"ఎప్పుడే, ఎప్పుడే అమ్మా?"

అమ్మావాళ్ళూ నవ్వేరా?

నవ్వేరు.

విశాలాక్షికి ఏడుపు వస్తోంది.

ఆరేళ్ళ ఆడపిల్ల కోరిన కోరికే పదహారేళ్ళు ఎదిగిన ఆడపిల్లకూడా కోరుతూ వచ్చింది.

ఈకోరిక్కి పదేళ్ళు వచ్చేయి.

ఈకోరికలన్నీ ఇలా పెరిగి పెద్దవయి చివరికి......

విశాలాక్షికి ఏడుపు వస్తోంది.

జరీఅంచు తెల్లచీర!

"కొందాంలే" అనేవాడు నాయన.

నాన్న నోట్లో ఉండేది చుట్ట, అతనిమనసులో ఉండేది పొగ, అతనికి ఉన్నదిఉద్యోగమా? అబ్బే! నౌఖరీ! అతని చేతిలో లేనిది,

"ఉన్నప్పుడు ఎప్పుడో ఒకప్పుడు కొంటాలే"

ఎప్పుడో ఒకప్పుడు శుభముహూర్తం వస్తుందని విశాలాక్షి చూస్తూనే వచ్చింది.

ఎంతో కాలంనుంచి ఎన్నెన్నిటి కోసమో ఈ విశాలాక్షి చూస్తూనే ఉంది

ఈ విశాలాక్షి సజలనయనగా, వ్యర్థంగా ..........విశాలాక్షికి ఏడుపువస్తోంది.

జరీ అంచు తెల్లచీర!

"ఎన్ని ఖర్చులున్నాయో...నువ్వెరగవా...మా నాయన చచ్చి చెడి...ఆ నాలుగు రాళ్లూ...ఏదో అదీ ఇదీ...జాగ్రత్తచేసి...తంటాలు పడకపోలేదు...చూడూ...ఈయేడు నీ పెళ్లి...చెయ్యక తప్పుతుందా...నీకు నచ్చిన చీరలు...కొనకపోతే అలా అను."

అని ముగిస్తుంది తల్లి.

"ఎవ్వర్నీ ఏదీ అడగను"

అని ఎన్నోసార్లు నిశ్చయించుకొంది విశాలాక్షి.

ఫలానాది కావాలని ఎవర్నడిగినా వాళ్లకుండే బాధలన్నీ వెళ్ళబుచ్చక తప్పదు.

వాళ్ళలా చెప్తోంటే ఇంకా బాధగా ఉంటుంది విశాలాక్షికి.

కాని అడక్కుండా ఉండలేదు.

"మళ్ళీ ఏదైనా అడిగావంటే చూడు. చమడాలెగరగొడతాను" అని తిట్టి, కొట్టి, వళ్లు హూనం చేసినా అంతబాధగా ఉండదు. వాళ్ళలా చెప్తోంటే మాత్రం ఏడుపువస్తుంది. కాని —

ఏడుస్తే ఒకప్పుడు సంతృప్తిగా ఉంటుంది. అందుచేత —

ఏడ్చి సంతృప్తి పొందడానికిమళ్ళీ మళ్ళీ అడుగుతూనే ఉండేది విశాలాక్షి.

ఒక్క జరీ అంచు తెల్ల చీర!

విశాలాక్షికి ఏడుపేవస్తోంది.

అమ్మ చెప్పేమాటలువింటే, చూస్తే—

పెళ్ళాష్టం అనేటంత పనయితేనే గాని ఈ విశాలాక్షికి దొరక దొక్క జరీ అంచు తెల్లచీర.

—ఛీ! నేను పెళ్ళే చేసుకోను.

కాని—

కటుకుండికి గుడ్డముక్కా; రెండుపూట్లా ఇంత తిండీ; వీటికోసం ఆడపిల్ల పెళ్ళి చేసుకోక తప్పదు.

తప్పదా?

—తప్పకపోయినా సరే; ముష్టయినా ఎత్తి బతుకుతాను గాని పెళ్లిమాత్రం చేసుకోను.

పెళ్లాడకపోతే నువ్వు ముష్టి ఎత్తవలసి ఉంటుంది. నీకు డబ్బూ లేదు; చదువూ లేదు.

—హావున్నిజం!!

ఆమెకి పాటయినా రాదు. ఆమె గు



"సిల్కు చీరలు కావాలా?" అని అడిగేడు షాపువాడు.

దైనా కాదు. మరి, లోకానికి దయున్నది లేదు.

విశాలాక్షికి ఏడుపువస్తోంది.. కాని... కాని...

—ఏమైనా సరే నేను పెళ్ళి చేసుకోను. చే.. సు.. కో.. ను.

విశాలాక్షి పళుకొరికింది.

—అందులోనూ అందరూ అలాంటి వెధవలే!

తెల్లచీర జ్ఞప్తికి వచ్చినప్పుడల్లా అమ్మ చెప్పే పెళ్ళిమాట జ్ఞప్తికి వస్తుంది. పెళ్ళి మాట తలపుకి వచ్చినప్పుడు ఆ వెధవ తలపుకి రాకుండా ఉండడు.

వాడే కనకారావు. అన్నయ్యాకి క్లాస్ మేటు.

వెధవ!

వాడా నీకొక ఫ్రెండని ఎంత చెప్పినా అన్నయ్యా వినడు. కాఫీ ఇప్పించేది వాడు. సినిమాలకి తీసుకువెళ్ళేది వాడు

ఇహ, వాడితో తిరగవద్దని ఎంత చెప్తే మాత్రం అన్నయ్యా ఎందుకు వింటాడు?

కాని, విశాలాక్షి మాట విశాలాక్షి ఎలా ఎవ్వరితో చెప్పగల్దు?

ఒకనాటి సాయంకాలం,

ఆరు గంటల మసక చీకట్లో,

అన్నయ్యా ఇంటి దగ్గర లేనప్పుడు,

నాన్న ఇంకా ఇంటికి రానప్పుడు, తమ్ముడు ఎక్కడికో వెళ్ళినప్పుడు, వంట గదిలో అమ్మ వండుతూన్నప్పుడు,

దొంగలా వచ్చిన కనకారావు,

"మీ అన్నయ్యా ఉన్నాడా?" అని మెల్లగా అడిగేడు.

"లేడు" అని గట్టిగా చెప్పింది విశాలాక్షి.

"అయ్యో! ఎలాగ? వాడి గదిలో నా పుస్తకాలుండిపోయాయే!"

"అన్నయ్యొచ్చాక తీసుకోవచ్చు."

నవ్వి తీరాలనే పట్టుదలతో కనకారావు నవ్వుతున్నాడు.

"వీడి యెదట నవ్వకూడదు" అనే నిశ్చయానికి అతన్ని చూసిన మొదటి రోజునే వచ్చింది విశాలాక్షి.

చేసేదేమీ లేక వాడు వెళ్ళిపోతూ ఉండగా,

అమ్మ వేసిన కేక:

# ★ జరీఅంచు తెల్లచీర ★

"ఎవరే వారూ?"

"అన్నయ్య ఫ్రెండు"

అనే మాటల్లో ఎంత నిరసన చూపించాలో అంత నిరసన చూపించింది విశాలాక్షి.

"ఎవరు, కనకారావా! అయితే, చిన్న గొట్లో కూర్చోపెట్టు. అన్నయ్య ఇప్పుడే వస్తానన్నాడు."

వెళిపోయే కనిగ్రహం అంతటితో వక్రించి వెనక్కి వచ్చింది.

అమ్మకి తెలీదు. వట్టి సత్యకాలం!

సాటికులంవాడు. గొప్పవాడు. చదువుకొంటూన్నాడు.

మా పిల్లని చేసుకుంటే బావుణ్ను.

అంతే అమ్మ ఉద్దేశం.

మంచి చేసుకుంటే మంచిదనీ, అందుచేత మంచి చేసుకుందామనీ అమ్మ తాపత్రయం.

ఆ ఉద్దేశంతో, ఈ తాపత్రయంతో, నాన్నకిఉంచిన కాఫీ పట్టుకువెళ్ళి వాడికి ఇమ్మంది.

—అయ్యయ్యో, అమ్మకేం తెలుసు?!

ఈ విశాలాక్షి కోపాన్ని ఆపలేదు. కన్నీటిని కట్టలేదు.

పిల్లని పెళ్ళాడతాడేమోనని అమ్మ ఆశ.

అయినా—

—కనకారావునా నే పెళ్ళాడేది?!

అయినా—

కనకారావా పెళ్ళాడేది?

అలాంటి ఫకీరు వెధవలు పెళ్ళాడరు.

ప్రేమలేఖలు రాస్తారు. తెరచాటున విజృంభిస్తారు.

అమ్మకి తెలీదు.

తల్చుకొంటూంటే విశాలాక్షి వళ్ళు దహించుకుపోతోంది.

చీకట్లో చెంగు పట్టుకున్న ఫకీరువెధవ...

అయ్యో, ఈ కుడిభుజం ఎందుకు తెగ్గొట్టరు!!

హయ్యో, ఈ కుడిభాగం ఎందుకు ఛేదించరు!!

ఈ పెనుమంట ఏడుపులో చల్లారదు.

విశాలాక్షిని ఏడవనీయదీ పెనుమంట.

కాని, విశాలాక్షికి వస్తోంది ఏడుపు.

—నాకు పెళ్ళయినా అయింది కాదు. ఏ ఒక్కడైనా సాయపడ్డానికి నాకయిదుగురు భర్తలైనా ఉన్నారుకారు.

ఈ కీచకుడి పీచ మడంచడానికి ఎవడున్నాడు?

ఎవడూ లేడు!

ఎవరితో చెప్పుకోడం?

ఎవరితోనూ లేదు!

పాపాత్ము లందరిమీదా ఒక్క పిడుగైనా పడదు.

పడ్డ అవమానం గురించి చెప్పుకునే శక్తయినా లేదు ఆడదానికి. చెప్పుకున్నా, శక్తిగల మగాడు కనిపించనైనా కనిపించడు.

ఆడపిల్లమీద,

తెరచాటున సాహసం, చీకట్లో పరాక్రమం,

ప్రదర్శించిన కనకారావు

ఏమీ జరగనట్టు, ఏం జరిగినా ఫరవాలేదన్నట్టు,

కోరవిరుచుకు నడుస్తూనే ఉన్నాడు.

వాడిచ్చిన కాఫీ తాగి, వాడు చూపించిన సినీమాలు చూస్తూనే ఉన్నాడు అన్నయ్య.

విశాలాక్షికి ఏడుపు వస్తోంది.

జరీ అంచు తెల్ల చీర!!

ఫకీరు వెధవ కనకారావు!

—వాడిగురించి తల్చుకోను.

కాని, ఈ మంట చల్లారదు.

వాడికీ, తెల్ల చీరకీ సంబంధం ఏముంది?

విశాలాక్షికి తెలీదు.

కాని, ఏదో సంబంధం ఉంది.

అంతా బీరకాయపీచు, ఒంటిగీతబొమ్మ.

విశాలాక్షి పరిస్థితికి, హీనస్థితికి, దౌర్భాగ్యానికీ, కారణం? కారణం? కారణం?

ఏవేవో కారణాలున్నాయి. అవేవీ విశాలాక్షికి తెలీవు.

కాని, ఆ కారణాలన్నింటికీ కనకారావునొక "సిమ్బల్"గా చేసుకొంటున్నట్లుగా కూడా విశాలాక్షికి తెలీదు.

తెల్లది, జరీఅంచుది, ఒక్క చీర ఉంటేనా??

కనకారావు రక్తంలో ముంచనా!

ఈ లోకాన్నే జయించనా!

ఒక్కటి, ఒక్క టేనండీ, ఒక్కటే!

విశాలాక్షి ఎన్నటికీ ఏడవదు.

కాని, ఏడుపే వస్తోంది విశాలాక్షికి. ఆనాడు సినిమాహాల్లో కనిపించినావిడ ఎక్కడుంది? తెరమీద గోపికలు ఏమయేరు? జరీ అంచులన్నీ ఎక్కడ పడున్నాయ్? తెల్లచీరలన్నీ ఏవీ ఎక్కడ? విశాలాక్షికి ఎందుకీ ఆవేదన?

మంచం కుక్కిలోంచి లేదామనుకొన్న విశాలాక్షి లేవలేక అలానే కూలబడి కూర్చొంది.

అన్నాతమ్ముడూ చదువుకొనే గదిలో హారికేన్‌లాంతరు మినుకుమినుకుమంటోంది.

ఆ గుడ్డిదీపం దగ్గర వాళ్లెలా చదువుతున్నారు? కట్టుకొందికి మంచి గుడ్డముక్క లేకుండా నేనెలా తిరగ్గలుగుతున్నాను? అమ్మకి ఏల నిదుర పట్టదు? నాన్నకి అగ్గిపెట్టెలు ఎందుకు దొరకవు? ఈ మంచం ఎందు కింతకుక్కిగా ఉంది? ఇందులో నేనెందు కిలా ఉన్నాను?

విశాలాక్షికి ఏడుపువస్తోంది.

ఒక్క తెల్లచీర—నేతదే—జరీఅంచుది!

"పోనీ, మామూలు తెల్లచీర కొనుక్కోరాదటే" అనేది అమ్మ.

"నా కక్కర్లేదు. అంతగా కావాలని నే నన్నానా యేం? ఏవో చీరలున్నాయి కదా! కట్టుకుంటున్నాను. చాలు"

"నీకు ఊం అంటే పౌరుషం, ఆం అంటే పౌరుషంగాని నేనెరగ్గానే, నీకు

తెల్లచీర కావాలనుందనీ! పోనీ, తెల్ల వాయిలు కొంటానూ! నీకు నచ్చిన అంచు అద్దకం చేయించుకొందువుగాని. యేం?"

"నాకు. అ. క్క. ర. లే. దు."

"అయితే, పోనీవే. నీ తత్వం ఏమిటో నాకర్థం కాదు"

ఏవో రంగుచీరలు కట్టుకొంటూనే ఉంది విశాలాక్షి.

కాని—

తెల్లచే కట్టుకున్నప్పుడు జరీ అంచుదే కట్టుకోవాలి!

అదొక తియ్యటి కోరిక.

నెరవేరదా?

పోనీ!

అంతేకాని—

కోరాసైను! తెల్లవాయిలు! అద్దకపుటంచు!

ఎప్పటికీ పెళ్లికాక మూడో పెళ్లి వాణ్ని చేసుకున్నట్టు!

అలా—

మూడో పెళ్లివాడు తలపులోకి రావడం చేతనే ఆసైనూ, ఆ వాయిలూ అక్కర్లేదంటుంది విశాలాక్షి.

అర్థం కాదు. ఎవ్వరికీ అర్థం కాదు.

తలబాదుకున్నా, ఎవరికీ అర్థం కాదు.

మంచంకోడుకి తలవేసి కొట్టుకోవాలనీ, గోడకివేసి తలబద్దలు చేసుకోవాలనీ, మనుష్యులందర్నీ చంపాలనీ, లోకానికి నిప్పుపెట్టాలనీ ఉంది విశాలాక్షికి.

ఏడవకుండా ఉండాలనుందివిశాలాక్షికి.

కాని, ఈరోజు సాయంకాలం విషయం తలపులోకి వస్తోంటే ఏడవకుండా ఉండలేదు విశాలాక్షి.

సాయంకాలం. నాన్న :

"అమ్మా! బజారుకి వెళ్దాం రావే"

"ఎందుకు నాయనా?"

"తెల్లచీర కావాలంటున్నావుకాదుటే!"

"నాయనా"

"బయల్దేరవే"

"ఊరకే అనేదాన్ని నాయనా! నాకక్కర్లేదు నిజంగా"

"పదవే, వెర్రిదానా! మళ్ళీ చేతిలో చిల్లిగవ్వుండదు"

అని అతను అన్నప్పుడు విశాలాక్షికి ఏడుపే వచ్చింది. ఎప్పుడో ఎక్కడో విన్న విషాదగాథలన్నీ తలపులోకి వచ్చేయి. స్మృతి పథాన్నుంచి జారిపోయిన విషాద దృశ్యాలన్నీ దారికి అడ్డుగా నిల్చేయి.

ఆస్పత్రి ఎదట, చెట్టుక్రింద, ఒకదినం మధ్యాహ్నం చూసిన పడుచుపిల్ల శవం, పెత్తల్లికూతురు నూతిలోపడిందని ఒకనాటి సాయంకాలం దీపాలు పెట్టేవేళ వార్త తీసుకువచ్చిన నలిగిన ఉత్తరం, మేడమీంచి పడిన మేస్త్రీకోసం ఏడ్చిన ఎదటింటి మనిషి, కడుపులో బల్లతో చనిపోయిన పక్కింటిపిల్లడు, అనకాపల్లి నుంచి రాత్రి ట్రెయిన్‌లో వస్తూ కిటికీలోంచి చూసిన చీకటికొండలు, ముసురు పట్టిన రోజులు, దీపాల్లేని రాత్రుళ్లు, ఇటువంటి

# ★ జరీ అంచు తెల్లచీర ★

వన్నీ ఎందుకు జ్ఞప్తికి రావాలి ?!

ఈ రోజు సాయంకాలం—

గోడవైపు తిరిగి కంటనీరు పెట్టడానికి కారణం అవన్నీ జ్ఞప్తికి రావడమే కాదు.

ఇంకోటి కూడా ఉంది.

అది ఉండబట్టే అవన్నీ స్ఫురణకి వచ్చేయి.

అది—

రక్తం!

బజారుకి వెళ్దామన్న మనిషి బజార్లో ఇవ్వబోయేది డబ్బు కాదు; నెత్తురు.



అతని ముఖం చూస్తేనే తెలుస్తుందా విషయం.

రక్తం ధారపోస్తేనే గాని తీరని కోరికలు నాకక్కర్లేదు.

విశాలాక్షికి ఏడుపు వస్తోంది.

"ఉత్తినే అనేదాన్ని. నిజంగా నాకలాంటి చీర అక్కర్లేదు" అని ఏడ్చి చెప్పినా నమ్మరెవ్వరూ.

"పద పద! వెలుతురుండగానే వెళ్లడం మంచిది".

కొత్తచీర కొనుక్కోవడానికి, ఉతికిన చీర కట్టుకొని బయల్దేరిన విశాలాక్షి ఏడ్చిందని ఎవరికైనా తెలుసా ?!

ఇద్దరూ బయల్దేరేరు. వెళ్లేరు.

కూతుర్ని వెంటబెట్టుకొని అతను బజారుకు వెళ్ళడం చాలా కాలానికది మొదటి సారి.

రోడ్డుమీదకి వెళ్ళగానే విశాలాక్షి గతుక్కుమంది.

రాత్రివేళ దీపం వెలుగులో తెలుపు పక్కన పెడితేనేగాని పసుపురంగేదో సరిగా తెలియనట్టు, ఇంట్లో వుండే లేమి నలుగురి మధ్యకీ వెళ్తేనేగాని సరిగా కనిపించదు.

విశాలాక్షి కళ్ళంట నీళ్లు తిరిగాయి.

ఇంట్లో ఎంతో గంభీరుడిగా కనిపించే ఆమె తండ్రి వీథిలో ఎందుకంత దీనుళ్లా కనిపిస్తున్నాడో ఆమెకి అర్థం కాలేదు.

ఇంత నీరసంగా ఎందుకున్నాడు? ఇంత దారిద్ర్యం ఎక్కణ్ణించి ముంచుకొచ్చింది? జీవం ఉండీ లేనట్టుగా ఇలా ఎలా నడవగలుగుతున్నాడు ?

నడిరోడ్డు కాబట్టి కన్నీరైనా కార్చకుండా ఏడవ్వలసి వచ్చింది విశాలాక్షి

"నాకీ జరీ అంచు తెల్లచీర అక్కర్లేదంటే ఎందుకు నమ్మరు వీళ్ళంతా"

నాక్కావాలి; కాని నిజంగా నాకక్కర్లేదు.

అతను నడుస్తున్నాడు. కొంచెం వెనగ్గా విశాలాక్షి.

అతని దగ్గర ఉన్నది పన్నెండు కాబోలు అంతకంటె ఎక్కువమాత్రం కాదు.

ఏ దుకాణంలో అడిగినా, కావలసిన చీర కనీసపు ఖరీదు ఇరవై.

షాపులు ఎక్కేరు. షాపులు దిగేరు.

నడిరోడ్డు మీదనో, లేక ఏ దుకాణంలోనో, ఏ క్షణాన్న ఉప్పెనగా ఏడుపు వస్తుందోనన్న భయంతో అగ్నిపర్వతాన్ని అణచుకొని, గోదావరి వరదని ఆపుకొని నడుస్తోంది విశాలాక్షి.

ఈ సాయంకాలం గురించి తల్చుకొంటూంటే చచ్చిపోవాలనిపిస్తోంది విశాలాక్షికి. వళ్లు మండిపోతోంది విశాలాక్షికి.

అందులోనూ ఆ ఆఖరి షాపువాడు !

మరో కనకారావు !

లోకంలో కనకారావుల్ని ఇట్టే పసిగట్టగలదు విశాలాక్షి. వాడో కనకారావని వాడి ముఖం చూస్తేనే తెలుస్తోంది.

కాని, వాడెందుకలా ఎంతో కాలం నుంచీ ధుమధుమ లాడుతున్నట్టుగా ఉన్నాడు?

తెల్లదొరల పాలన పోయిందనీ, షాపుకి సీమదొరలు రావడంలేదని వాడికి కోపంగా ఉన్నదని విశాలాక్షికేం తెలుసు ?!

అతనికే గాని శాసనాధికారం ఉంటే సీమదొరలూ, ఐ. సి. యస్ ఆఫీసర్లూ, మహారాజులూ తప్పించి వేరెవ్వరూ తన షాపుకి రావడానికి వీల్లేదని శాసించ గలిగిన వాడు ఆ షాపువాడు.

ఆ సంగతి విశాలాక్షికీ తెలీదు. ఆమె తండ్రికీ తెలీదు. కాని, ఆ షాపు ముఖం చూస్తేనే వెళ్లాలనిపించలేదు.

"ఒద్దు నాన్నా! అది గొప్ప షాపు"

"ఇంతదూరం వచ్చేం కదా! పోయి చూద్దాం రా"

షాపు వాడేకాదు కనకారావు. వాడి నౌఖర్లందరూ కూడా కనకారావులే.

అమాంతంగా కాళ్లు వచ్చి నడుచుకొచ్చిన చెత్తడబ్బాని చూసినట్టుగా వాళ్లంతా తన తండ్రిని చూశారని విశాలాక్షికి తెలుసు.

విశాలాక్షిని వాళ్ళంతా ఏ దృష్టితో చూశారో కూడా విశాలాక్షికి తెలుసు.

విశాలాక్షికి అవమానం భరించే శక్తి లేదు.

శక్తిలేకపోయినా భరించి తీరాలి.

విశాలాక్షి దహించుకు పోతోంది.

"సిల్కు చీరలు కావాలా ?" అని అడిగేడు షాపువాడు.

ఆ మాటల్లో వెటకారం లేదన్న వాళ్ళ కళ్లు పీకేస్తాను.

అందుకు, విశాలాక్షి తండ్రి :

"అబ్బే..." అని ఆరంభించేడు.

ఆ "అబ్బే"ని ఉచ్చరించడంలో ఎందుకంత దౌర్భాగ్యాన్ని ధ్వనించడం ?

అందులోనే ఎందుకంత సిగ్గు? ఎందుకంతభయం?

"అబ్బే... నేతచీరలు... తెల్లవి... కొత్త జరీ....చూపిస్తే చాలు...

వద్దు వద్దు. పోదాం.

(43-వ పేజీ చూడండి)

# నా భవిష్యత్తు

మెయిన్ రోడ్డులో వెడుతూంటే, "మేడమ్ జేష్ సాముద్రిక నిపుణి" అన్న బోర్డు నా దృష్టి నాకర్షించింది; ఒక పెద్ద మేడకి ఎక్కడో పైభాగంలో తగిలించి ఉంది. నా భవిష్యత్, నా స్వభావం లోని విశేషాలు తెలుసుకుందామని వెంటనే నిశ్చయానికి వచ్చాను.

మేడ మెట్లెక్కుతోంటే రకరకాల సైన్ బోర్డులు కనబడ్డాయి. "పాపుల్ వర్త్ అండ్ సన్స్ - సర్వేయర్స్"; "జె. బి. బర్టన్ అండ్ కంపెనీ, ఎన్‌క్వయిరీ ఏజంట్స్" అని ఇంకా రకరకాలుగా ఉన్నాయి. మూడంతస్థులు ఎక్కి దిగినా గాని మేడమ్ జేష్ బోర్డుమాత్రం కనుపించ లేదు. కిందకి దిగివచ్చి మళ్ళీ రోడ్డుమీంచి పైకి చూడగా, మూడో అంతస్థులో ఒక కిటికీకి కట్టిన లేస్ కర్టెన్ కనపడింది. అంత చక్కటి లేస్ పని అయితే మేడమ్ జేష్ దే అయి ఉండాలి. మెట్లన్నీ ఎక్కి వెళ్ళి ఆ కర్టెన్ దగ్గర్లో తలుపు తట్టగానే తెరువబడింది.

కిటికీకి తెరకట్టి ఉండడంవల్ల గదిలో వెల్తురు తక్కువగా ఉంది. తెర కొంచెం వత్తిగించి "చెయ్యి చూపించుకోడానికి వచ్చారా? కొంచెంసేపు కూచోండి అలా" అని ఎవరో అన్నట్లనిపించింది. వెలిసిపోయిన ఒక పాత సోఫాలో కూలబడ్డాను. కూర్చున్న ఆ పదినిముషాలు, తెరవెనుక ఏవో గుసగుసలు వినిపిస్తోనే ఉన్నాయి. చివరికి ఇద్దరు వయసు మళ్ళిన స్త్రీలువచ్చి, నన్ను లోపలికి పిలిచి మేడమ్ - జేష్‌కి ఎదురుగా ఒక కుర్చీలో కూర్చోబెట్టి పక్క కుర్చీలో ఆసీనులయ్యారు. వీళ్ళిద్దర్నీ చూస్తే, వీరి తాలూకు భర్తలు ఏ పది పదిహేనేళ్ళ క్రితమో అదృశ్యులయి ఉండాలనిపించింది.

మేడమ్ - జేష్‌లో నే నూహించిన విశిష్టతేమీ కనుపించలేదు. గుండ్రటి కందగడ్డలాంటి మొహాన్ని కళ్ళజోడు. బొద్దుగా, పొట్టిగా నడివయస్సులో ఉంది. చేతుల్లేని నల్లటి శాటిన్ గౌను తొడుక్కుంది. చూడ్డానికి ఏ సముద్రపు వడ్డునో హోటలు నడుపుతో, చలికాలంలో థియసాఫికల్ సొసయిటీ సభలకి వెళ్ళే దానిలా ఉంది. ఇతర సమయాల్లో సరదాగా ఉండే మనిషే అయి ఉండవచ్చుగాని ప్రస్తుతం చాలా దీక్షగా కూర్చుని ఉంది.

టేబుల్ మీద ఒక గాజు స్ఫటికము పెట్టి, నా రెండుచేతులూ దానిమీద ఉంచి, అడగదల్చుకున్నవన్నీ మనస్సులో అనుకుంటూ ఉండమని చెప్పింది. నా ఎడమచేయి అందుకొని, నిదానించి రేఖలు పరిశీలించి, ఎంతో సన్నిహితభావంతో మొదలెట్టింది.

"అవును. నే ననుకొన్నట్లే ఉంది. మీ రెప్పుడూ కొంత ముభావంగా ఉంటారు. అందువల్ల ప్రజలు మిమ్మల్ని అపార్థం చేసుకుంటారు. ఎంత సహృదయులో వారు గ్రహించలేరు. తెలిసిందకదూ ? దీనివల్ల మీరు ఆత్మవిశ్వాసం కోల్పోతున్నారు.

మూలం : జె. బి. ప్రీస్ట్లీ

అనువాదం : ఎస్. వి. కృష్ణారావు

ఇదే మీ అభివృద్ధికి అడ్డు వస్తోంది. మీరు మాత్రం ఇతరుల మనస్సులు ఇట్టే గ్రహించేయగలరు. ఇందులోమాత్రం మీది అఖండమైన తెలివి. ఎదుటివాళ్ళు ఏం చేసినా, ఏంమాట్లాడినా దానిఅంతరార్థం సూక్ష్మంగా పసికట్టేయగలరు. కాని, ఏం లాభం? మీ మితభాషిత్వంఉండే, దీనివల్లే వస్తోంది చిక్కంతా. ఎఱిగినవాళ్ళంతా అపార్థం చేసికోడం, దాంతో మీ ఆత్మవిశ్వాసం తగ్గడం - తెలుస్తోందికదూ?"

చూడబోతే 'ఈ తెలిసిందికదూ' అనేది ఈవిడకో ఊతపదంలా ఉంది. అది మానిపిస్తే ఈవిడసలు బతకలేదేమో అనిపించింది. అదేమాట ఒకమాటు విచారంగానూ, ఒకమాటు ఉత్సాహంగానూ, ఇంకోమాటు ఆవేశంతో బల్లగుద్ది ఉపయోగిస్తోంది. ఈవిడ చెప్పినవాటి కన్నింటికీ తల పంకిస్తోనే ఉన్నాను. ఆశ్చర్యమేమిటంటే, నా స్వభావంగురించి చెప్పిందంతా వాస్తవమే.

అక్కడికి నా ఎడంచేయి చూడ్డం అయినట్లుంది. ఇంక కుడిచేతిరేఖలు తీక్షణంగా పరిశీలించి, మళ్ళీ చెప్పడం మొదలెట్టింది. "మొదట్లో మీరు చాలా కష్టపడి పని చేసేరు. కాని తగినంత ఫలం పొందలేకపోయినారు. మీ శ్రమ ఫలమంతా ఇతరులకి దక్కుతోవచ్చింది. తెలిసిందికదూ? మీది ఉద్యోగమైనా [illegible] ఇక్కడ స్పష్టంగా కనుపిస్తోంది.

మీరు ప్రస్తుతం ఉద్యోగం చేస్తున్నారు. కిందటి ఏటికంటా ఈఏడు మీ రెక్కువ ఉత్సాహంగా పని చెయ్యగలరు. మే, జూన్ నెలలు చాలా అదృష్టవంతమైనవి. తొందరలోనే ఉన్నతిలోకి వస్తారు. ఇన్నాళ్ళనుంచీ మీరు వేచిఉన్న అవకాశం ఇప్పుడు రాబోతోంది. తెలిసిందికదూ?"

తెలియకేమి? స్పష్టంగా తెలుస్తోంది.

# ★ నా భవిష్యత్ ★

ఇన్నాళ్ళనుంచీ నేను పడుతూన్న అవస్థే ఇది. నా చుట్టూ పోగయిన చుట్టాలూ, పక్కాలు, స్నేహితులూ, డాక్టర్లూ అంతా పైకి నేను పచ్చగా ఉండడంచూసి, నిజమే అనుకునే వారేగాని, నాలోని ఈ అశాంతిని కనిపెట్టలేకపోయినారు.

నా చేతులు చూడ్డం ఇంక మానేసి, ఆ స్ఫటికంలోకి తీవ్రంగా చూస్తో మేడమ్ షేష్ అంది. "మీకు బోలెడంత డబ్బు వస్తుంది. రెండు మార్గాలనుండి వస్తుంది. తెలుస్తోందా? స్పష్టంగా కనబడుతోంది ఇక్కడ. రెండు మార్గాలు..."

రెండేం ఖర్మం, నూరుమార్గాల డబ్బుకి కాళ్ళువచ్చి నా దగ్గిర్నించి నడిచిపోడం స్వానుభవమే—అయినా ఈ రెండు మార్గాల్లో ధనం ఛళఛళ మెరుస్తో ప్రవాహంలా వచ్చి నా మీదే కేంద్రీకరింపబడ్డం ఒక కొత్త ఆనందం, ఉత్సాహం కల్గించాయి. అసలు ఆ రెండు మార్గాలేమిటో మొదట నా కర్థం కాలేదు (ఒకవేళ అర్థంఅయినా మీ అందరికీ ఎందుకు చెప్పెయ్యాలి?) రాబోతున్న ఐశ్వర్యం నన్ను పారవశ్యాణ్ని చేసింది.

"ఇద్దరు వ్యక్తులు ఇందులో కనబడుతున్నారు. ఒకడు సన్నగా పొడుగ్గా ఉన్నాడు. వయసు మీరినవాడు. చాలా నమ్మకస్థుడు. రెండోవాడు పొట్టిగా లావుగా ఉన్నాడు. పూర్తిగా విశ్వసనీయుడు. వీరిద్దరూ కలిసి మీకు ధనం చేకూరుస్తారు. ఉండండి. దేనిమీదో వరస బెట్టి సంతకాలు చేస్తున్నారు..."

"అలాగా? నిజానికి రోజూ చాలాచోట్ల సంతకాలు పెడుతూనే కథ నడుపుకొస్తున్నాను."

"అబ్బే - అలాంటివి కావు. ఇవేవో చాలా ముఖ్యమైనవి. చాలా లాభసాటివి." మరి కొంతసేపు స్ఫటికంలో రెప్పవాల్చకండా చూసి,

"మీరో పట్టణంలో వెడుతున్నారు. వీథులు ఇరుకుగా ఉన్నాయి. మేడలు మాత్రం ఆకాశం అంటుతున్నాయి. ఆ పట్టణంలో ఏదో గొప్ప పనిమీద వెడుతున్నారు. అక్కడ మీకు ఐశ్వర్యం కురుస్తుందంటే నమ్మండి. ఇరుకుసందులు, పెద్ద మేడలు - బహుశా లివర్‌పూల్ గాని, మేన్‌ఛెస్టర్ గాని..."

"అయి ఉండదు" అని గొణిగాను. స్వదేశంలోని లండన్, లివర్‌పూల్, అవడం కంటె, ఎక్కడో విదేశాల్లోని వింత వింత కొత్తపట్టణాల్లో ఐశ్వర్యం లభిస్తోందంటే ఆసక్తి గల్గుతుంది. అయినా ఈవిడకి సాముద్రికం వచ్చు గాని, జాగ్రఫీలో నట్టు ఉండవచ్చును, అని సమాధాన పరచుకున్నాను.

"అంటే ఇరుకుసందులు కాకపోవచ్చును. మేడలు చాలా పెద్దవి అవడంవల్ల అలా అనిపిస్తోంది. ఏది ఎలా ఉన్నా, అక్కడ మీరు అఖండమైన విజయం పొందుతారు."

ఇంకేం! అలా అయితే అది తప్పకుండా న్యూయార్కు అయి ఉంటుంది ఊహా ప్రపంచంలోకి ఒక్కమాటు తేలిపోయి చూడసాగాను. ఆ మహానగరంలో, సినిమా సినేరియాలకి, సీరియల్ నవల్లకి, అమెరికన్ స్త్రీ సంచికల్లో అయిదేసి వందల డాలర్ల వ్యాసాలకి, కంట్రాక్ట్ పత్రాలమీద సంతకాలమీద సంతకాలు చేసేస్తోంటే, పొడుగుపాటి సన్నవాళ్ళు, పొట్టిగా లావుపాటివాళ్ళు అతి నమ్మకమైన మొహాలతో నా వ్యవహారాలు చక్కబెడుతున్నారు. ఇలా తన్మయుణ్ణయి ఉండగా,

"ఇంకా ఏదైనా అడగదల్చుకుంటే అడగండి" అంది.

తెలుసుకోవలసినవన్నీ తెలుసుకున్నాను. ఇంక ఏమి అడగడమా అని నేను ఆలోచనలో పడ్డ రెండు మూడు నిముషాల్లోనూ ఆవిడ మళ్ళీ నా బుద్ధికుశలత, నా ముఖభావం, తన్మూలంగా ప్రపంచం అపార్థం చేసుకోడం, ఆత్మవిశ్వాసం కోల్పోవడం, అనతి కాలంలో రాబోతూన్న ఐశ్వర్యం గురించీ నొక్కి చెప్పింది. ఇక అడగవలసిం దేమీ లేక, నేనెంత ఇవ్వాలో అడిగాను.

"ఎంత, ఒక గ్రౌను మాత్రమే. అదన్నా మీకు తృప్తి గల్గితేనే."

తృప్తి? ఇంతకంటా ఇంకా ఏమి కావాలి? నా పుట్టుపూర్వోత్తరాలేమీ తెలీకండానే, నా మనస్సులో ఇన్నాళ్ళనుంచీ పీడిస్తోన్న విషయాలన్నీ అరటిపండొలిచినట్లు చెప్పేసింది. ఒకటి కాదు, వంద గ్రౌనులు ఇచ్చినా ఈ ఋణం తీరదు.

నేను లేచివచ్చేస్తోంటే, ఎవళ్ళోమరో ఇద్దరు, తమతమభవిష్యత్ చెప్పించుకోడానికి లోపలికి వస్తున్నారు. ఆ కించిత్సమయంలో వాళ్ళ మొహాలు పరిశీలనగా చూడలేకపోయినా, ఒక్క చూపులోనే సూక్ష్మంగా గ్రహించేసేను. వాళ్ళుకూడా సునిశితమైన తెలివితేటలు ఉండికూడా, కేవలం మితభాషిత్వంవల్లనే ప్రపంచంచేత అపార్థం చేసుకోబడుతూ, ఇన్నాళ్ళూ ఇక్కట్లుపడ్డా అనతికాలంలోనే ఐశ్వర్యవంతులు కాబోతూన్నట్లు తెలిసికోబోతున్నారని కనిపెట్టేసేను! పాపుల్‌వర్త్ అండ్ సన్స్ - సర్వేయర్స్; జె. బి. బర్టన్ అండ్ కంపెనీ - ఎంక్వయిరీ ఏజంట్సు. అన్న బోర్డులు దూసుకుంటూ, మెట్లన్నీ దిగి, మళ్ళీ బయటి ప్రపంచంలోకి వచ్చిపడ్డాను. ★

# వంద రూపాయిల నోటు

డబ్బు కావలిసొచ్చింది. చాలా అవసరంగా. కొన్ని సరుకులు కావాలి. ఇతరఖర్చులకు కొంతకావాలి. మా మరదలూవాళ్లూ వచ్చారు. వాళ్లంతా బెజవాడ వెళ్లాలనుకున్నారు. కేవలం సరదాకే అనుకోండి. వాళ్లతోబాటు మా శ్రీమతికూడా బయలుదేరాలని సంకల్పం. సంకల్పం అయితే భేషుగ్గా ఉందిగాని, కేవలం కరచరణాలు మాత్రం చాలవు దాన్ని ఆచరణలో పెట్టడానికి. తొమ్మిదవ అంగం, అతిప్రధానాంగం, డబ్బు కావాలి. దానికోసం పరిశ్రమించాలి చూడండి. కావలిసినప్పుడల్లా, కావలిసినంత దొరికే వస్తువైతే అది 'డబ్బు' కానేకాకుండా పోతుంది.

మరీ యీ ఒకటవతారీఖు నెలకి ఒక్కసారే రావడం మరీ అన్యాయంగా ఉన్నదనీ, అధమం రెండుసార్లైనా రావడం చాలా అవసరమనీ మా శ్రీమతి తన కనీసపు కోర్కెను చాలారోజుల క్రితమే బయటపెట్టింది. కాని ఆ మా వాంఛ నెరవేరే సుదినం యింకా రానందువల్ల ఆనెల చివరి దినాన నేను రోడ్డు మలుపుదగ్గర నిలబడి, నెపోలియన్‌లా చేతులు వెనక్కి కట్టి, తల ముందుకువంచి వ్యూహం పన్నుగడకోసం ఆలోచన చెయ్యవలసి వచ్చింది.

ఈనాటివరకూ చాలా అరుదుగా డబ్బు అడిగిన ఆసామిని అడగాలిగాని, మిగతా వాళ్లు దమ్మిడీ యివ్వరనే రహస్యం నాకు ముందే తెలుసు. వరూధినికి "వనవిల్తు శాస్త్రమున మినుకులా వర్తించు పని"లా నాకు అప్పు పుట్టించడం పన్నుతో బెట్టిన విద్య! నా స్నేహబృందంలో అలాంటి వ్యక్తులు యిద్దరు. వాళ్లని ఎప్పుడూ యింకా అప్పు అడగలేదు. ఇలా ఆలోచిస్తూండగా సావుకారు ఎదురయ్యాడు. సినీమాకే కాబోలు సీరియస్‌గా వెళిపోతున్నాడు. వీణ్ణి అడిగిచూదాం...యివ్వడు మూడు వంతులు.

"ఎక్కడికో సీరియస్‌గా వెళ్లిపోతున్నారు సావుకారుగారు. కొంపదీసి సినిమాకి కాదుగదా" అని ఆపాను.

సావుకారు ఆగాడు. "లేదురా-పార్క్‌లో వెంకట్రావుగాడితో పనుండి. వాడక్కడ ఉంటానన్నాడులే."

నాకు తెలుసు యిది నాటకమని. సినిమాకని చెపితే ఎక్కడ యితరులు వస్తారో అని వీడిభయం.

"ఏడికావులేవోయ్ - వెధవ పని లేని సమయం ఒకటుంది నీకు-సర్లేగాని పిక్చర్‌కి పోదాం వస్తావా? డబ్బులు నే పెట్టుకుంటానులే గాభరాపడకు"

"లేదురా...నిజంగానే పనుంది....."
నీళ్ళు నమిలాడు సావుకారు.

"సరే. రేపెల్లాం...తప్పకుండా రా- First show కి."

"అల్లాగేలే..."

"అవును గాని నడు చెప్తాను. కొంచం నీతో పనుందిరా."

"ఏమిటది"

"ఏమీలేదు,అవసరంగా ఒక ఐదురూపాయిలు కావాలి. మళ్ళా రేపిచ్చేస్తాను. నాదగ్గరో అయిదున్నాయి. యింకో అయిదు అవసరమయింది. నీదగ్గర తప్పకుండా ఉంటుందనే ధైర్యంతో అడిగాను."

## వి. నారాయణరావు

"రామరామ - ఉంటే నీ క్కాదంటానురా. అసలీవాళ పొద్దున్నయితే అయిదేకాదు అయిదు వందలిచ్చేవాణ్ణి. యిప్పుడు దమ్మిడీ ఉంటే చచ్చినంత ఒట్టు. ఏమనుకోకు మా యివ్వలేనందుకు." సావుకారు గబగబా వెళ్ళిపోబోయాడు.

"సరే. దానికేంలే. ఫరవాలేదులే. మా గిరినడిగి తీసుకుంటాను. వాడు మనకు కొంత యివ్వాలిలే. రేపు మరిచిపోకుండా సినీమాకి రావాలి సుమా."

సావుకారుగు వెళ్ళిపోయాడు. అసలు వాడిస్తాడని నే అనుకోనేలేదుగా. అసలు డబ్బుకి వాడి ప్రాణానికీ లంకె. లక్షాధికారి బిడ్డడా, ఒక్కసారి సినీమాకైనా చూస్తూ చూస్తూ డబ్బు ఖర్చు పెట్టలేదు. అధివా వెళ్ళదల్చుకున్నా ఎవ్వరూ చూడకుండా, ఎవరితో చెప్పకుండా వెళ్తాడు. లేకపోతే ఎవరేనా వెంటపడితే వాడి ఖర్చు భరించాలిసొస్తుంది. ఇప్పుడు వాడు సినీమాకే బయలుదేరాడు. వాడి వేషం, వాలకం గ్లాస్కో లాల్చీ లోపల రూపాయి నోట్లూ, యీ విషయం చెప్పేస్తున్నాయి.

* * *

నా మొదటి గట్టినమ్మకం శ్రీనివాసరావు దగ్గర ప్రయత్నించాలి. అతను చిరకాలం నుంచీ మిత్రుడు. బజారులో Fancy shop. ఆ షాపులో కొన్ని సామానులు అరువిచ్చినా చాలు. మనకి డబ్బే యివ్వక్కరలేదు. సరే. షాపుకి వెళ్ళాను

"ఏమండోయ్. శ్రీనివాసరావుగారు. వ్యాపారం బాగా సాగుతోందా"

"ఏదో మీ దయవల్ల."

"షాపు బాగా పెద్దది చేశారే"

"అవునండి - యీమధ్య మీరెక్కడా కనపడడం లేదే"

ఏమిలేదండి, ఆఫీసులో పనులెక్కువయి. అసలు తీరుబడి ఉండడం లేదండి. చూడండి మనదగ్గర పియర్స్ పౌడరుఉందా?

"ఆ ఉందండి. పియర్సుంది, క్యూటక్యూరా ఉంది. పాండ్సుంది. మీకేది కావాలి?"

"పాండ్సు ధర ఎంతండీ?"

"ఆ? ఎంతండి, రూపాయిముప్పావలా."

"అబ్బా ధర పెరిగిందండీ. సరేగాని, యింకా రిబ్బన్లూ అవీకూడా కావాలి."

శ్రీనివాసరావు లేచి నిలబడి రిబ్బన్లు చూపించడం ప్రారంభించాడు. పౌడరు డబ్బాల రకాలు ముందు పేర్చాడు. నేను మెల్లిగా ప్రారంభించాను.

"శ్రీనివాసరావుగారూ నేనూ యిలా తిన్నగా ఆఫీసునుంచి యిటు వస్తున్నాను. యీ సరుకులు కొంచం అర్జంటుగా కావాలి. రేపు ఉదయం డబ్బు పంపించడానికి మీ కభ్యంతరం లేదుగా." యీ మాటలనేసి శ్రీనివాసరావు మొహంకేసి చూశాను. అతను ఏమంటాడో అని.

# ★ వందరూపాయల నోటు ★

"అరరె! బలేచిక్కు తెచ్చిపెట్టారే. మీబోటివాళ్లకి అప్పిస్తే ఏ భయమూలేదనుకోండి. మీదగ్గర డబ్బు దాచుకొన్నట్టే. కాని మాకో వాటాదారున్నాడండీ. దాంతో, ఏవో లెక్కలూ వ్యవహారం; అసలీ అప్పూ, అనామత్తు వ్యవహారం పూర్తిగా మానుకున్నాం. మీరూ అనుభవజ్ఞులు. మీకు తెలియందేముంది. అయినా ఒకపని చెయ్యండి. మీకు కావలసిన సరుకులు విరి యిక్కడే ఉంచండి. రేపుదయం మళ్లీ మీరు శ్రమ పడనక్కరలేకుండా, ఒక కుర్రాణ్ణి పంపండి డబ్బిచ్చి. ఈ సరుకలన్నీ కట్టి అతని చేతికిచ్చి భద్రంగా పంపుతాను." అన్నాడు ఎంతో సానుభూతి చూపిస్తూ.

నా మొగాన్ని నెత్తురు చుక్క లేదు. ఇంకేం మాట్లాడలేక, సరుకులు కావలసినవి తీసి పక్కన పెట్టి రేపు కుర్రాణ్ణి పంపుతానన్నాను. డబ్బు రాలేదు సరిగదా పైగా కొంతబాధ్యత నెత్తికొచ్చింది.

తలవంచుకుని చక్రవర్తి యింటికెళ్లాను. వీడేనా నన్నకన్న రెండో గట్టి ఆధారం.

"చక్రవర్తి నా కర్జంటుగా అయిదు రూపాయిలు కావాలిరా" అన్నాను సిరియస్‌గా, ఏ ఉపోద్ఘాతం లేకుండా.

"బంగాళాపురా, యిప్పుడసలు దమ్మిడీ లేదు. ఇవాళేదో పనుండి మా నాన్న నడిగితే తనదగ్గర అసలేమీ లేదన్నాడు... ఉంటే తప్పకుండా యిచ్చేవాణ్ణే."

ఇంక మళ్లీ మాట్లాడలేదు నేను. సరేలే, యింకోచోట చూస్తాను అని బయలుదేరి వచ్చేశాను. నేను బయలుదేరిన రోడ్డు తిన్నగా యింటిదాకా ఉందని మా గుమ్మం ముందు మా మరదలు పిలుపు వినిపించేదాకా తెలియలేదు

తిన్నగా యింటికెళ్లి పడుకున్నాను. భోజనంకూడా సరిగా చేయలేదు. ఏమిటెంత దారుణమయిన వైఫల్యం? అయినా యీనెల చాలా ఎక్కువ ఖర్చయింది. అందుకే అప్పుకు బయలుదేరవలసి వచ్చింది. అయినా యీ ఆడవాళ్ళకి మరీ యింగిత జ్ఞానంలేదు లేకపోతే యిప్పుడు ప్రయాణమేమిటి? వాళ్లకేం తెలుసు యీ శ్రమ చెప్పేద్దామనుకున్నాను ప్రయాణం మానెయ్యమని..... ఏమో - చెప్పలేకపోయాను. కొత్తగా కాపురం పెట్టిన రోజుల్లో అర్ధాంగి 'ప్రియురాలు' గా ఉంటుంది. (ఆవిడని ఆ రోజుల్లో అర్ధాంగి అనడంకంటె సర్వాంగి అనడం మంచిది) కొన్నాళ్లకి ప్రియం తగ్గి చులకయిపోయి కేవలం భార్య అయి ఊరుకుంటుంది. ఏమో పాపం, ఎంత మనసుపడి ప్రయాణం పెట్టుకుందో. కాదంటే నొచ్చుకుంటుంది. ఇంత పురుషుడూ ఉండి పదిరూపాయిలు సమయానికి తేలేకపోతే. భార్యముందు ఎంత పరాభవం?- పైగా ఉన్నవారి యింటి పిల్ల. అయినా రేపు రాత్రికి గదా ప్రయాణం.

మన్నాడు పొద్దున్న మరదలు చేతి కాఫీ తాగి ద్రవ్యాన్వేషణకి బయలుదేరబోతున్నాను. యింతట్లో మరదలు పిలిచి

"బావగారికి మరీ పనిలేక పోతూందిట కాస్త పని చెప్పాలి. ఈ వంద రూపాయిల నోటుకి చిల్లర తెచ్చిపెట్టండి" అని నోటు చేతి కందించింది.

"మా ఊళ్లో యీ నోటుకి 90 రూపాయిలే నే శశీ-" అన్నాను నవ్వుతూ.

"పోనీ ఆ పదీ మీరు వేసి వందా పట్రండి. 'బావగారు సంపాదిస్తున్నారుగా" అంది తడుముకోకుండా నోటు జేబులో పెట్టుకుని బయల్దేరాను

*  *  *

నాది కాకపోయినా వంద రూపాయిల నోటు జేబులో ఉండడం ఎంతో ధైర్యాన్నిచ్చింది. ఆ నోటు నాది కాదనడానికి ఏమీ ఆధారం లేదు. డబ్బు అతిచంచలం. సామాన్య నాయికలాగా అందరికీ వర్తిస్తుంది. అది ఎవరి చేతిలో ఉంటే వారిదే. ఇంకోరిది దనడానికి ఏ ఆధారమూ ఉండదు. మామూలుగా చొక్కాలూ, పంచెలూ, రిస్టు వాచీలు, భార్యలూ, వీటికన్నిటికే గుర్తులుంటాయి. కాని డబ్బుకలా కాదు. డబ్బు ఎవరి చేతిలో ఉంటే వారి ఆస్తిఅయి చక్కా పోతుంది. ఇప్పుడు యీ వంద రూపాయిల నోటు నాదే ననిపించింది. ఇంకో రెండంగుళాలు పెరిగినవాడిలా నడిచాను.

ఈ వందరూపాయిలూ మార్చి మరదలు చేతి కిచ్చేస్తే దీని విలువ ఏమీ పెరగదు. దీంతో ఒక అద్భుతమయిన నాటకం ఆడాలి. భలే - మంచి ఆలోచనే తట్టింది.

తిన్నగా చక్రవర్తియింటి కెళ్లాను. మా యింటి చుట్టుపక్కల వంద రూపాయల చిల్లర యివ్వగల పెద్దషాపు లేవీ లేవు బజారు చాలా దూరం. చక్రవర్తి యిల్లే దగ్గరలో మోతుబరుల యిల్లు.

"చక్రవర్తీ - చక్రవర్తి"

చక్రవర్తి వచ్చాడు. "ఏమిరా నిన్న 5 రూపాయిలు దొరికాయా" అన్నాడు.

"లేదురా-అసలు అక్కరలేకపోయింది. మా నాన్న *T. M. O.* పంపేడు వంద

కృష్ణుడు ఎవరి చేతో దెబ్బలుతిని ఏడుస్తూ ఇంటికి వచ్చాడు. అమ్మ అడిగింది:

"మళ్లీ దెబ్బలాటలు సాగిస్తున్నావన్న మాట. నేనేం చెప్పాను? కోపం వచ్చినప్పుడు నూరు అంకెలు లెక్కపెట్టమన్నానా, లేదా?"

"అవునమ్మా, నేను లెక్కపెడుతూనే వున్నాను. ఇంతలో నాళ్లరాముడు మీదపడి కొట్టాడు. వాళ్లమ్మ వాణ్ణి యాభై అంకెలే లెక్కపెట్టమన్నదట."

రూపాయలు. అసలది *Expect* చేశాను. కాని ఆలస్యం అయిందన్నమాట. పొద్దున్నే వచ్చింది."

"*Very Good* - లక్ అంటే అలా ఉండాలి."

"సరేగాని నా కర్జంటుగా వంద రూపాయిల చిల్లర కావాలి.

నిన్న ఆ శ్రీనివాసరావుషాపులో కొన్ని సరుకులు కొన్నాను. ఇంకా తెల్లవారనేనా లేదు. అప్పుడే కుర్రాణ్ణి పంపించాడు. అయినా యింత *Idiot* అయిపోతున్నాడేమిటా శ్రీనివాసరావు. ఇంతలోకే పారిపోతామనుకున్నాడా?"

"పోనీరా - *Uncultured Brute.*" అన్నాడు చక్రవర్తి.

"అంగుకేరా వాడి డబ్బు వాడిమొహాన పారేసితే సరి బోడిడబ్బు -"

చక్రవర్తి లోపలికెళ్లొచ్చాడు.

"సరేగాని చక్రవర్తీ మాటినీకెళ్దాం వస్తావా? చార్లిచాప్లిన్ 'ముష్యూర్ వర్డో'. చాలాబాగుంటుందిరా."

"అలాగే వెళ్దాం. యిదిగో బట్టలు వేసుకువస్తా. మరి చిల్లర యింకోగంటకిగాని దొరకదు. మానాన్న "పూజలో ఉన్నాడు"

"అగె! ఆ కుర్రముండాకొడుకు యింటి దగ్గర కాసుకూర్చున్నాడు. మనకి మాటినీ టైమవుతోంది" అన్నాను.

చక్రవర్తి సావకాశంగా "వాడి కంతి వ్వాలి" అన్నాడు.

"ఆ! ఎంతరా ఐదు రూపాయిలలోపు.

"సరేయీ ఐదూపట్టుకెళ్ళివాడికిచ్చెయ్యి.

మనం బజారులో నోటు మార్చినప్పుడు తీసుకుంటాలే."

"*Thanks* - వాడి శని వదిలిపోతుంది.

సరే నేను యింటికెళ్ళి బట్టలేసుకుని సిద్ధంగా ఉంటాను. నువ్వు మాయింటికిరా. కలిసిపోవచ్చు మాటినీకి."

ధైర్యంగా యింటికి వచ్చాను చక్రవర్తి రాలేదు. ఆ 5 రూపాయిల నోటుని చూసి నవ్వుకున్నాను. ఈ చక్రవర్తే నిన్న దమ్మిడీ లేదన్న చక్రవర్తి. ఈ వేళ 100 రూపాయిల నోటు నా విలువ పెంచింది. చక్రవర్తి మ్యాటినీకి వస్తాడని నేను అనుకోలేదు. ఎందుకంటే యీరోజు ఆదివారం. వాళ్ళింట్లో ప్రతి ఆదివారం పూజకి సరం జామా సమకూర్చే బాధ్యత చక్రవర్తిది. వాళ్ళనాన్న చూస్తూండగా బయటకిరావడం చక్రవర్తితరం కాదు.

ఆదివారమైనా ఆఫీసుపని కొంచెం ఉంది 12 గంటలకి భోజనంచేసి ఆఫీసుకిపోయి పని చూసుకోవచ్చు. ఈ లోపుగా బజారుకి పోయిరావాలి. తిన్నగా శ్రీనివాసరావు షాపు దగ్గర కెళ్ళాను. నవ్వుతూ "మీరే స్వయంగా శ్రమపడి వచ్చారే" అన్నాడు. "నా పనికి రాక తప్పుతుందా శ్రమేమిటి?" అన్నాను.

గబగబా పర్సుతీసి — "నా కర్జంటు పనుంది. ఇంకో వండి కోర్టుకి వెళ్ళాలి. కొత్త ఆ సరుకులు యిలా యివ్వండి ఎంత 5 రూపాయిలను కుంటాను." అంటూ వంద రూపాయిల నోటు తీశాను.

శ్రీనివాసరావు మొహం పెద్దదయింది. అంత పొద్దున్నే అతని షాపులో చిల్లర ఉండదని నాకు తెలుసు.

"అరె! చిల్లర లేవండి—తెప్పించాలి."

"అయితే కుర్రాణ్ణి పంపించి తెప్పించండి త్వరగా."

"కుర్రవెధవ యింకా రాలేదండీ".

"చంపారే సరే- నేనిలా నోటుమార్చు పని వచ్చి యిస్తాను ఈ కట్ట యిలా యివ్వండి".

శ్రీనివాసరావు మాట్లాడలేకపోయాడు. వందరూపాయిలతో సహా ఉన్న నన్ను ఒక 5 రూపాయిల వస్తువులు పట్టుకెళ్ళద్దని లేకపోయాడు. తినిగా, ఛాతీ విప్పుకొని ఆ కట్ట పుచ్చుకుని యింటిదారి పట్టాను. (వెండి కోర్టు సంగతి వట్టి నాటకమని తెలుసుగా)

ఇంటికెళ్ళి రణరంగ విజేతలా మొహం పెట్టి - ఆ డబ్బూ, ఆ వస్తువులూ, అర్ధాంగి కర కమల సమర్పితం చేశాను. ఆ మొహం వికసించింది. మనిషే పులకరించిపోయింది. మొహమంతా కళ్ళయి, ఆ కళ్ళంతా పాపై ఆ వస్తువులు చూసింది పెదిమలు సన్నగా నొక్కి, పెదిమల చివరల చిన్న గుంటలు పడితే, ఆ గుంటలనిండా సౌందర్యం నింపింది. కళ్ళల్లో నల్లపాపలు వయ్యారంగా ఒక మూలకి చేరి తొంగిచూస్తున్నాయి ఆ సౌందర్యాన్ని.

* * * *

ఈ వందరూపాయిల నోటు యిక చిల్లర మార్చొద్దు.

మధ్యాహ్నం ఆఫీసు పని, నిద్ర, అన్నీ అయిపోయాక వీధిలోకి బయల్దేరాను.

రోడ్డుమలుపుదగ్గర షావుకారు కనిపించాడు.

"రా సినిమాకి పోదాం" అన్నాను. ధైర్యంగా.

నిన్న మాటిచ్చాడుగా. తప్పించుకోలేక పోయాడు. అయినా తను డబ్బు పెట్టుకో నక్కరలేదనే ధైర్యం బహుశా ఉండే వచ్చాడు.

బుకింగ్ దగ్గర నేను వందరూపాయిల నోటుతీసి టిక్కెట్లివ్వమన్నాను. చిల్లర లేదన్నాడు.

అప్పుడే ప్రారంభం బుకింగ్.

షావుకారు నోటుచూశాడు. మొహం రంగుమారింది. తను టిక్కెట్లుకొన్నాడు.

సినిమా అయిపోయింది. ఆవేళ షావుకారున్నంత హుషారుగా ఎప్పుడూ లేడు. అంత ఆప్యాయంగా ఎప్పుడూ మాట్లాడలేదు.

తిన్నగా యింటికివస్తూ మా ర్వాడి షాపులో చిల్లరమార్చేశాను. నోటు యిచ్చేస్తుంటే అప్రయత్నంగా రెండు కన్నీటి చుక్కలు రాలేయి కృతజ్ఞత ప్రకటిస్తూ ఇంతపనీ ఆ నోటు చేసింది మరవలు పుణ్యామా అని.

చిల్లరనోటు జేబులో వేసుకుని బయలుదేరాను. ప్రపంచమంతా ఒక పెద్ద వంద రూపాయిల నోటుమీద ఆనుకుంది—ప్రతివాడూ ఎప్పుడూ మార్చకుండా ఒకవంద రూపాయిలనోటు జేబులో ఉంచుకొంటే.

ఇంటికొచ్చేసరికి నాకు ప్రయాణానికి సిద్ధమవుతున్నాడు నేను చెప్పకుండా సినిమాకి వెళ్ళినందుకు అప్పజెల్లెళ్ళిద్దరికీ కోపం వచ్చింది, కోపం వచ్చినప్పుడు 'ఆవిడ' మొహం యింకో బాగుంటుంది.

అయితే మార్చని వందరూపాయిలనోటు కన్నా విలువైనదా యీ సౌందర్యం? ★

# కోడరికంతో అత్తరికం

కోడలు లలిత, ఇంటికి వస్తూంటే గుమ్మందగ్గర దిష్టి తీసి హారతి యిచ్చింది రమణమ్మ సగర్వంగా సంతోషంతో. హారతి వెలుగుల్లో నిగారించే నును చెక్కిళ్ళతో భవిష్యత్తునుగూర్చి కలలుకనే కాటుకకన్నుల్తో ఆ పదిహేనేళ్ళ పడుచు అమాయకపు మొహం చూసేసరికి రమణమ్మకి తన వివాహమూ, భర్తతో తను గృహప్రవేశం చేస్తూంటే అత్తగారు వెంకాయమ్మ యిచ్చిన హారతీ జ్ఞాపకం వచ్చేయి. తను ఎన్ని కలలుకంది భర్తతో భవిష్యత్తులో ఎంతో ఆనందిద్దామని! అంతా ముప్ఫయిళ్ళ నాటిమాట! కొన్ని యుగాలు గడిచినట్లుంది. ఈలోగా ఎన్ని మార్పులు? కాపరానికి రాగానే తన ఆశలన్నీ అడియాసలయ్యాయి. నిమిష నిమిషానికీ అత్తగారి సాధింపుల్తో మనస్సు వేగిపోయింది. జీవితం వాడిపోయింది. రాత్రింబగళ్లు వంటింట్లో చాకిరీతో, తిట్ల బహుమానాల్తో దిగనారిపోయింది. భయం, సంకోచం లేకుండా భర్తతో గడియగడపటానికిగాని బయటికి తిరగటానికిగాని తను నోచుకోలేదు. తపించిన తన మనస్సు వినే ఆప్తులులేక తనలోనే దహించుకుపోయింది. తను సిగ్గు దొంతరలతో అమాయికంగా హారతిచ్చే అత్తగారి చిరునవ్వు మొహం చూసేటప్పుడు ఆ నవ్వులోనే తన జీవితం ఆ పళ్ళకిందబడి నలిగిపోతుందని ఎల్లా అనుకోగలదు?

లలిత కాపురానికి వచ్చింది. రమణమ్మలో అంతర్యామిత్వమై, అణగారిపోయిన నిస్పృహ యిప్పుడు లలిత రావటంతోటే కట్టవలు తెగి అధికారరూపంగా కోపంతో కసితో చలాయించటం మొదలెట్టింది. అసలు లలితపై తనకీ నిరంకుశాధికారం ఎవరుయిచ్చేరు, ఎల్లా వచ్చింది అన్న విమర్శే లేకపోయింది రమణమ్మకు. తను చిన్నప్పుడు అత్తగారివల్ల పడిన బాధను లలితద్వారా తీర్చుకోటం మొదలెట్టింది.

కాపరానికొచ్చిన మర్నాటినుంచీ ఇంటిపనంతా లలితపై బడ్డది. వచ్చీరాని జ్ఞానంతో అభం శుభం తెలీని లేతవయస్సులో పూర్తిగా అపరిచితులైన వ్యక్తుల మధ్యలో వారివారి అవసరాలు గుర్తించుకు పనులుచేస్తూ, వాళ్ళ ఆగ్రహానుగ్రహాలకి తలఒగ్గుతూ నాలుగు గోడలమధ్య జీవితం గడిపే స్త్రీ పురుషునికంటె అన్నివిధాలా సమర్థురాలేమో?

"పాపం రాణీగారు ఇంకా అంతఃపురం లోంచి దిగిరాలేదులా వుంది" అంటోంది రమణమ్మ పొద్దున్నే. చాచే భర్తహస్తాల్ని తప్పించుకుని, వెళ్తొన్నందుకు చిరుకోపం సూచించే అతని మొహం చూడనట్లు మొహం పెట్టి "వస్తున్నానత్తయ్యా" అంటూ మేడ మెట్లు దిగి వస్తోంది లలిత. లలిత అల్లా మెట్లు దిగుతూంటే రమణమ్మకి మనస్సులో అదే మెట్లు 30 ఏళ్ళ క్రింద తను దిగుతూండడం, గదిలో భర్త చిరాకూ (తను వెళ్ళిపోతున్నందుకు), క్రింద తన అత్తగారి కేకలూ అంతా జ్ఞాపకంవచ్చింది. అప్పుడు తను ఎంత బాధపడింది? పాపం లలితకి ఎంత కష్టం వేసిందో?

## నిట్టల శ్రీరామమూర్తి

"ఏమీ లేదులే అమ్మా, దాసీదీ పాలవాళ్లూ వస్తారు. కాస్త పెందరాడే లేస్తుండాలి పెద్దదాన్ని నేను లేవలేనని" అని పూరుకుంది రమణమ్మ. లలితమీద ప్రయోగిద్దామనుకున్న తిట్లన్నీ వాటంతటవే లోలోపలనే హరించుకుపోయాయి. ఆ వేళ రమణమ్మ వంటచేసింది. "నువ్వెళ్ళి వాడికేం కావాలో చూసుకో అమ్మా, నేనిక్కడ పనులు చూసుకుంటానులే" అని పెందరాడే మేడమీదికి పంపించేసింది రమణమ్మ రాత్రి భోజనాలు కాగానే. లలితకి అనిపించింది 'తన అత్తగారు ఎంతో మంచివారు.'

ఆరోజు లలిత కిటికీలో అద్దం వుంచి దువ్వెన్నముక్కతో తల దువ్వుకుంటోంది (భర్త తెచ్చే దువ్వెనలన్నీ ఆడబడుచులే లాక్కుంటారు మరి.) పొరపాటున చేయి తగిలి అద్దం క్రింద పడింది. అద్దం ముక్కముక్కలైపోయింది. లలిత గుండెల్లో రాయి పడింది. "అమ్మా వదినేం అద్దం క్రింద పారేసిందే" అని అరిచింది లలిత ఆడబడుచు సూర్యమణి. "ఏమిట్రా ఆ చప్పుడు" అంటూ రమణమ్మ పైకి వచ్చింది.

"అయిందీ. నేను అనుకుంటూనే వున్నాను. ఎప్పుడో ఆ కాస్తపనీ అవుతుందని. నిక్షేపంలాంటి అద్దం ఎల్లా ముక్కలైపోయిందో? ఆదేం చేతులమ్మా మరీనీ. నా చిన్నప్పటినుంచి వస్తోంది ఆ అద్దం. కొందామంటే దొరుకుతుందా?" అంటూ ప్రారంభించింది రమణమ్మ. సాయంత్రం దాకా అల్లా సాధిస్తూనే వుంది ఏదో వంకబెట్టి. లలిత లేత హృదయం దిగాలుపడిపోయింది. ఆ కాస్త అద్దంకోసం అంతగా తన్ని వేపుకు తినడమా. తనూ మనిషేననీ, తనకూ హృదయం వుందనీ తను ఎంత బాధపడిపోతోందో గ్రహించిందా ఆవిడ? తన అత్తగారి మంచితనం ఏమైపోయిందో లలితకి అర్థం కాలా. "పొరపాటైంది అత్తయ్యా చూడలేదు" అంటూ ఏడుస్తూ కూర్చుంది లలిత. లలిత ఏడుపు చూసి రమణమ్మకి గబుక్కున తన చిన్ననాటి సంఘటన జ్ఞాపకం వచ్చింది. ఆరోజు తనూ అద్దం క్రింద పారేసింది. వెంకాయమ్మగారు ఎన్ని కేకలు పెట్టింది తన్ని? అప్పుడు తనెంత ఏడ్చింది? తనకనిపించింది తన అత్తగారికూతురే అల్లా అద్దం పగలగొడితే ఆవిడ అల్లా తిట్టేదా అని పాపం లలిత మనస్సుని తను ఎంత గాయపరిచింది?

"పోనీలే అమ్మా వూరుకో ఏదో పొరపాటు అందరికీ వస్తుంది. పిచ్చిపిల్లా దానికంత ఏడు పెందుకూ? ఏమన్నారని" అని సముదాయించింది రమణమ్మ. అప్పుడే వీధిలోంచి హాల్లులోకి అడుగెడుతున్న కొడుకుని "ఏమిరా? అస్తమానూ నువ్వొక్కడివే అల్లా తిరక్కపోతే కాస్త దాన్నికూడా ఏ సినీమాకో బీచికో తీసుకుపోగూడదూ? ఒక్కత్తే ఇంట్లో ఏంతోస్తుంది?" అం(టోంది) రమణమ్మ.

"అల్లాగేనమ్మా" అంటూ నవ్వు మొహంతో మేడమీదకు వెళ్లిపోయాడు సుందర్రావు. లలితకి అత్తగారితరహా అర్థం కాలేదు. ఓ క్షణానికి చెడామడా తిట్టి తన్ని నానా మాటలూ అంటుంది. మళ్ళీ క్షణంలో కన్నతల్లికంటె ఎక్కువ ప్రేమగా చూస్తూ తనూ తనభర్తా సుఖంగా వుండటమే మహాభాగ్యం అనుకుంటుంది. 'అస్తమానూ అల్లా ప్రేమగానే వుండకూడదా' అని అనిపిస్తుంది లలితకి. క్రమేణా రమణమ్మ మనస్తత్వం లలితకి అర్థమైపోయింది. ఆవిడ ఏదేనా అన్నప్పుడు మనస్సుకి పట్టించుకోకుండా

సర్దుకుపోవడం మొదలెట్టింది. ఇలా మబ్బు ఎండల మార్పులతో లలిత జీవితం గడిచిపోతోంది.

*      *      *

కోడలు శ్యామల ఇంటికి వస్తూంటే లలితమ్మ గుమ్మందగ్గర దిష్టితీసి హారతిచ్చింది సంతోషంగా. శ్యామలచూసే అమాయికపు చూపులు లలితమ్మ కాపరానికి వచ్చిన మొదటిఘడియలు జ్ఞాపకం చేశాయి. శ్యామల కాపరానికి రాగానే తాళం చెవుల గుత్తి ఇచ్చివేస్తూ అంది లలితమ్మ, "ఇదిగో శ్యామలా, ఇవాళనుంచి నీదే ఇంటి పెత్తనం, జాగ్రత్తగా సరిదిద్దుకో".

మర్నాటినుంచీ శ్యామలని కన్న కూతురిలా చూసుకోవడం మొదలెట్టింది లలితమ్మ. శ్యామల నేంపని చేయనిచ్చేదికాదు. శ్యామలని ఎవరూ అనేవాళ్లు లేకపోవడం మూలాన్ని స్వేచ్ఛ ఎక్కువైంది. విచ్చలవిడిగా భర్తతో షికార్లూ, రోజూ సినీమాలూ, రాత్రిళ్లు ఆలస్యంగా ఇంటికి రావటం, ఉదయం పొద్దెక్కి లేవటం సంసార బాధ్యత ఏమీ పట్టించుకోని మనిషిలా ప్రవర్తించటం మొదలెటింది శ్యామల. ఎంత ఆలస్యమైనా కనిపెటుకు కూర్చునేది లలితమ్మ. వాళ్ళిద్దరికీ భోజనాలు పెట్టి వంటిల్లు కడుక్కుని సామాన్లంతా సర్దుకొని అప్పుడు పడుకునేది. చనువు ఎక్కువైపోయి శ్యామలకి అత్తగారంటే గౌరవంగాని, భయంగాని లేకుండా పోయింది.

ఓ రోజున లలితమ్మకి జ్వరం వచ్చింది. పెందరాడే కాస్త కాఫీ త్రాగి పడుకుంది. శ్యామలా వెంకటేశం సినిమా కెళ్లి రాత్రి పది గంటలకి ఇంటికి చేరుకున్నారు. రాగానే భోజనాల హడావిడి ఏమీలేకపోవటం చూసి శ్యామల విసుక్కుంది. చిర్రుబుర్రుమంటూ, ఇక్కడి వక్కడా, అక్కడి విక్కడా పారేసి, పెద్ద చప్పుళ్ళతో గిన్నెలూ అవీ పడేసి ఎల్లాగైతేనేం భోజనాలు ముగించి పైకి చక్కాబోయింది భర్తతో.

పొద్దున్నే మామూలు వేళకి లేవలేకపోయింది లలితమ్మ. శ్యామల మేడమీంచి దిగి వచ్చేసరికి ఏడున్నర అయింది. ఇంకా కాఫీలు లేవు. విసుక్కుంటూ శ్యామల కాఫీ నీళ్లు పెట్టింది. లలితమ్మ మంచంమీంచి లేవలేదుజ్వరముతో. శ్యామల 'ఎల్లా వుంది' అనేనాతనని అడగనందుకు లలితమ్మ మనస్సు చాలాకష్టపడింది. శ్యామల మేడమెట్లు దిగుతూంటే లలితమ్మకి తన అత్తగారన్న దెప్పిపొడుపుమాటలు జ్ఞాపకం వచ్చేయి. తన విషయంలో అన్యాయ మనిపించిన. ఆతిట్లన్నీ శ్యామలవిషయంలో సరియైనవే అనిపించాయి. కాని శ్యామల నేదో అందామనుకున్నమాటలు ఆమె హృదయంలోనే ఇగిరిపోయాయి. ఇంతలో వెంకటేశం "ఎల్లా వుందే అమ్మా" అంటూ మేడదిగివచ్చాడు. లలితమ్మ అంటోంది శ్యామలతో "అదేమిటే అమ్మాయి? వంటింట్లో వస్తువు లెక్కడి వక్కడే వున్నాయి. ఓదాని మీదా మూతలులేవు. అలమారు తీసి వెళ్లిపోయినట్లున్నావు మజ్జిగంతా పిల్లి త్రాగేసింది. కాస్త చూసుకోనక్కర్లా"

"ఎంత చేసినా అంతే మీకేం తృప్తిలేదు నావొళ్లు హూనం అవటంతప్ప వెధవచాకిరీ చెయ్యలేక చస్తున్నాను" అంటూ ప్రారంభించింది శ్యామల బుంగమూతితో. లలితమ్మ నిర్ఘాంతపోయింది. తన "మంచి" అటు అత్తగారికీ అవసరం లేకపోయింది ఇటు తన కోడలికీ అవసరం లేకపోయింది! శ్యామల తన్నిలా ఎదిర్చి మాట్లాడుతుందని కలలోనైనా అనుకోలేదు లలితమ్మ.

"అసలే ఆమెకి జ్వరంగావుంటే పైగా నీపోటీమాటలు కూడా దేనికి? ఇంట్లో పనులు కాస్త చూసుకో నక్కర్లా" అని శ్యామలని మందలించి బయటికి వెళ్లిపోయాడు వెంకటేశం. దీనిఫలితం మరి మూన్నాళ్లదాకా భార్యాభర్తలు ఎడమొహం పెడమొహమూనూ. అన్నీ తెలిసిన లలితమ్మ వెంకటేశాన్ని కూకలేసింది. "చిన్నపిల్ల, అభం శుభం తెలీదు. నువ్వైనా కాస్త తెలుసుకుని మెలగుతూ వుండాలి దాన్నేమీ అనకూడదు. పాపంలేత మనస్సు బాధపడుతుంది" అని. తల్లీకొడుకుల సంభాషణ చూచాయగా వంటింట్లోంచి విన్న శ్యామల, తల్లి కొడుక్కేదో నూరిపోస్తోంది తనమీద అని అపోహపడి మరీ ధుమధుమలాడ్డం మొదలెట్టింది.

లలితమ్మకేం అర్థంకావటంలా, అప్పుడు తన్నలా తన అత్తగారు శేకలెయ్యటానికీ ఇప్పుడు తన కోడలు తన్నిలా ధిక్కరించటానికీ రోజులు దొర్లిపోతున్నాయి. ఆ యింట్లో ఓరోజు విందు ఓరోజు మందు!

*      *      *

ఆరోజు శ్యామల పుట్టింటికి వెళ్లింది తన అప్పకూడా పుటింటి కొచ్చిందని తెలిసి. ముందు శ్యామలని పంపటానికి ఇష్టపడని వెంకటేశం తల్లిమాట తీసెయ్యలేక 'సరే' అన్నాడు. తనమీద ప్రేమతోనే పంపిస్తోందో, తను ఇంట్లో వుండడం ఇష్టంలేకే పంపిస్తోందో తేలలేదు శ్యామల అనుమానపు మనస్సుకి.

శ్యామల అప్ప అత్తగారిముందు వెంకాయమ్మలాంటివాళ్లు బలాదూరు. శ్యామల తన అక్కగారి కష్టాలన్నీ వింది. అత్తగారంటే అల్లా వుంటారా అని ఆశ్చర్యపోయింది. మరి తన అత్తగారు ఎప్పుడూ ఏమీ అనేది కాదే? ఇంకా అమ్మే నా అనేదికాని. బహుశా అప్పఅన్నట్లు ఆవిడ ఆ కష్టాలు అనుభవించివుంటుంది. అంచేతే తన్నలా ప్రేమగా చూస్తోంది. ఒక్కసారి శ్యామలకి తన కళ్ళముందు తెర తొలగించినట్లయింది. అత్తగారంటే వున్నట్టుండి ఎంతో ప్రేమపుట్టుకొచ్చింది. లలితమ్మని చూసేవరకూ తోచలేదు. మర్నాడే ప్రయాణమై అత్తారింటికి వెళ్ళిపోయింది శ్యామల. శ్యామల అనుకోకుండా అంత త్వరగా వచ్చేసినందుకు ఆశ్చర్యపడింది లలితమ్మ.

మర్నాడు తెల్లవారగట్ల 5 గంటలకి లేచింది శ్యామల. "మీరు పడుకోండి అత్తయ్యా, నేను అంతా చూసుకుంటాను" అని ఇంటి పనులన్నీ చూసుకోవడం మొదలెట్టింది.

ఆ రోజు మామూలుగా పెత్తనానికి వచ్చే రత్తమ్మ ఆశ్చర్యానికి సమాధానంగా చెప్పింది లలితమ్మ. "కోడలికి ఇంటి పనులన్నీ అప్పజెప్పి చాకిరీ చేయించినా భరించలేదు. అల్లాఅని విచ్చలవిడిగా వదిలేసినా బాధ్యతలు తెలిసిరావు. వాళ్ళ మానాన్ని భర్తతో హాయిగా వుండేటట్లు సావకాశం యిస్తూ మంచి మాటల్తో సంసార దక్షత నేర్పాలి. వాళ్ళలో తప్పులుంటే సహనంతో క్షమించాలి. ఎందుకంటే ఆ వయస్సులో మనమూ అల్లా చేసేవాళ్లమే కాబట్టి." శ్యామల అందుకుంది "అత్తగారిచ్చిన స్వేచ్ఛని పాడుచెయ్యకుండా భర్త సుఖం చూసుకుంటూ, ఇంట్లో పనులు అడిగి తెలుసుకుంటూ, అత్తగారిలో వున్న బలహీనతల్ని అర్థంచేసుకుని సమయానుకూలంగా నడచుకుంటే కోడలు కూతురూ, అత్తగారు తల్లీ అవుతారు ప్రేమానుబంధంలో."

తనమూలంగా తన కొడుకూ కోడలూ దావాలు చేసుకుని విడాకు లిచ్చుకోవటం మాత్రమే తెలుసుకోగల్గిన రత్తమ్మ ఈ రెండు సమాధానాల్నీ సమన్వయం చేసుకుందుకు ప్రయత్నిస్తూ అర్థం కానట్లు మొహం అదోలా పెట్టి వెళ్ళిపోయింది శాస్త్రిల్లుగారి పురాణం వినటానికి. ★

# శత్రువు

"ఏ కోసరం ఓ అమ్మాయి వచ్చిందండీ." అన్నది నేను రాగానే సుందరమ్మగారు. నేనా అమ్మాయి ఎవరా అని ఆలోచిస్తుండగానే ఆవిడ అన్నది ఇలా "నాలుగంటలకి వస్తానన్నది. మిమ్మల్ని ఎక్కడికీ వెళ్ళవద్దన్నది."

ఆశ్చర్యపడుతూ నా గది తెరచి లోని కొచ్చి కూచున్నాను. టేబిల్ పైన 'రాధ' ఫోటో వుంది. నాకోసరం ప్రత్యేకించి నే చెప్పిన పోజులో కూచుని ఫోటో తీసుకొంది అది. క్రితం సుందరమ్మగారు చెప్పిన విషయం మర్చిపోయాను. రాధని తల్చుకొంటే ఒక్కోసారి నాకు అసూయ కూడా పుట్టేది. అసూయ పడకూడదనే అసూయ పడుతాను. అవును మరి! మగడు శత్రువు అంటూ చేచేతులారా - నా సుఖాన్ని పాడుచేసుకొన్నాను; ఒంటరి జీవితంలో మహదానందం ఏదోవుందనిభ్రమ పడి ఇప్పుడు విచారిస్తూ కూచున్న అభాగ్య జీవిని! రాధకు పెళ్ళయి నాల్గు సంవత్సరాలు కావస్తోంది: మేం వేసుకొన్న పంతంలో అది ఓడిపోయింది. రవిని చూసి మనసు మార్చుకొందో? ఏదోగానీ వచ్చిన ఉద్యోగం కూడా కాలదన్ని పెళ్ళాడింది. దర్జాగావుంది దాని బతుకు. దాని సౌందర్యం సార్థకమయింది; నా లావణ్యం నీట కలిసింది. పాతికేళ్లు తిరిగిపోయాక ఎందుకో పెళ్ళంటే నా శరీరం జలదరిస్తుంది. కానీ.. పెళ్ళంటే...ఒక విధంగా అసహ్యభావం వుంది. ఎలాగైతే ఏం? పాతికేళ్లు గడిచాక ఆ పైన జీవితము గడవకపోతుంది? అదంతా పోనీ...నాకోసరం వచ్చిన పిల్లెవరు? ఎవరో అయివుంటుంది. ట్యూషన్ చెప్పమనేమో; అంతే అయివుంటుంది. అంతకు మినహా ఎవరొస్తారు? హాల్లో గడియారం నాల్గుగంటలు కొట్టింది. నాగదిలో చెప్పులు శబ్దం కాగానే తలెత్తి చూశాను. ఎవరా అమ్మాయి? రాధ!

"నువ్వా?" ఎప్పుడు రావడం?" అన్నాను ఎదురుగా వెళ్ళి.

"ఇప్పుడే ఇందాక..అబ్బ! కూర్చోరా" అని విసుక్కుంటూ కొడుకుని కూలేసింది. వాణ్ణి నే తీసుకొన్నాను. ముద్దు పెట్టుకోను నా కిష్టం లేకపోయినా రాధని చూసి ముద్దెట్టుకొన్నాను. "నీ పేరేం బాబూ?" అంటూ.

"అఁ" ఆవెధవని నువ్వు తాకుతావనుకో లేదుసుమా! వాడికి పేరొకటి తక్కువ..." రాధ ముఖం చిట్లించింది.

"ఏమిటికథ రాధా! మీవారొచ్చారా!" అన్నాను. నా కెందుకో సంతోషం వేసింది.

"ఇంకోజన్మకి: శారదా! నువు నిజంగా ఎప్పటికీ అదృష్టవంతురాలివి. మాట తప్పిందానికి శిక్ష అనుభవించి వచ్చాలే. ఈజన్మలో......" దాని శరీరం వణికింది. కళ్ళు ఎఱ్ఱపడ్డవి.

నేను కొద్దిగా ఆశ్చర్యపడ్డాను "కథేమిటే మాతల్లీ!" నాలో సంతోషం ద్విగుణీకృతమయింది.

## ఎస్. రాజేశ్వరీరాణి

"కథ! నాబతుకు ఒకకథ అయిపోయింది ఆఖర్న! నిజంగా గర్భశత్రువే ఆడదానికి మొగుడు. అమ్మయ్య! నీ స్నేహంవల్ల కొద్దిగా పుణ్యం చేసుకొన్నాను కాబోలు. ఇప్పటికన్నా ఆ నరకకూపంనుంచీ బయట పడ్డాను. నాకో ఉద్యోగమన్నా చూడు. లేదా నీ పుస్తకాలెత్తుకొని ప్యూనులాగ వస్తాను నీవెంట. అంతేకానీ......"

వున్నట్లుండి కథ ఇలాగ తయారయి నా చెవిలో పడేసరికి చెవులు గింగురుమన్నయ్. "రాధా! నువు జగండవేసి వచ్చినట్లుంది. కడప విడిచిరావడంతగదు వివాహితురాలికి. నాలుగేళ్లు కాపురం వెలిగించావు. హఠాత్తుగా ఏంవచ్చింది?" వ్యంగ్యంగాఅన్నాను.

"ఏంవచ్చిందా! రాంది వచ్చిది కాబట్టే ఇలా వచ్చాను. అందులో మొగుడు అందంగా వుండాలని ఆడపిల్ల కల కనటం మొదటితప్పు. వాణ్ణి పెళ్లాడటం రెండో తప్పు. వాడే సర్వస్వం అనుకొనడం మూడోతప్పు.........." అగ్గో క్తిలో దాని నోరు మూశాను. నాకు నవ్వొచ్చింది.

"నిలుపురాధా! ఎవరేనావినగలరు. ఇంటివాళ్లు గదిలోకి రాబోయేరు నీ ఆవేశంచూసి. నీకింకా పిల్లతనం పోలేదు"

"నోరుమూయ్ శారదా! నీ వేళాకోళం నాకూ తెలుసు: పిల్లతనం పోయింది పిల్లవానిమీద ఆశపోయింతర్వాత."

"ఆ పిల్లవాడేం తప్పు చేశాడు?" నా సంతోషం ఏమని రాయడం?

రాధ ఓ కథ చెప్పింది. దాంతో రవిమీద నాకు కోపం, అసహ్యం కూడా కలిగింది. "రాధా! నీకు వుద్యోగం రాకపోతే పోయింది. మనిద్దరికీ ఎవ్వరూ లేకపోయినా నీకు నేను, నాకు నీవు నీ పాపకి మనిద్దరం వున్నాము" అన్నాను. రాధ నాతో చెప్పిన కథ మీ కనవసరం అనుకొంటాను.

దాదాపు నెల రోజులు తిరిగిపోయింది. రాధకీ నాలుగు ట్యూషన్లు కుదిర్చాను. ట్యూషన్‌కి పాతిక! రాధ ట్యూషన్ చెప్పడంలో అందెవేసిన చెయి. ఓరోజున రాధ డాక్టరుగారమ్మాయికి ట్యూషన్ చెప్పను పోయింది. గదిలో నేనూ బాబూ వున్నాము. నే నేదో రాసుకొంటుండగా ఓ వ్యక్తి రావడం బాబును ఎత్తుకోవడం జరిగిపోయిం తర్వాత తలెత్తాను. బాబు పోలికలు ఆ వ్యక్తికి అట్టే ఏమిటి? అసలే లేవు! కానీ అతను రవి అని మాత్రం తెల్సుకొన్నాను. బాబుని ప్రియంగా (పైకో, లోపలికో) ముద్దెట్టుకొని నావేపు చూసి "మీ స్నేహితురా లేదీ?" అని అడిగాడు. నాకు ఒక్కటి అర్థంకాలేదు. రాధ చెప్పడం: బాబంటే అగ్గిలో ఉప్పని రవికి. కానీ ఆ ప్రియమైన లాలింపు! ముద్దు?

"బాబూ! దా" అన్నాను. వాడు రాలేదు. రవి నవ్వాడు.

"ఆలు మగల మధ్య మీ రిరుక్కోవడం నాకంత తృప్తిగా లేదండి. రాధని నయానా, లేక భయానా పిల్చుకోపోవడానికి నాకు హక్కుంది. దయచేసి మీరిందులో తలదూర్చకండి. ఇది నా ఘష్షు, లాష్టు వార్నింగ్ కూడా! ప్రస్తుతం మీ గదిలో నే వుందనుకొంటాను రాధ. మీరూ దానికి మంచి మాటలు చెప్పి నావెంట వచ్చేటట్లు చెయ్యాలి."

నాకు అరికాలినుంటి తల కెక్కింది. కులట అని తలుపు బీగం వేసుకొని వెళ్ళినవాడు ఈ బుద్ధి ఎక్కడి కెళ్ళింది రవికి! నేనుకూడా బుద్ధిమాటలు చెప్పి పంపాలట కూడా!

"రవి బాబూ! మిమ్మల్ని నేను బొత్తిగా ఎరగనిదాన్ని కాదు. రాధ నా ప్రాణ స్నేహితురాలని మీకు తెలిసినందుకు చాలా సంతోషం! రాధపై మీకు విశ్వాసం లేదని,

భార్య:— "ఏమండీ, నా 'వనితావనం' పుస్తకం కనిపించడంలేదు, మీరేమన్నా చూశారా?"

భర్త:— "ఇప్పుడు దాంతో నీకేంపని? ఆఫీసు టైమవుతోంది, ముందు వంట చెయ్యి."

భార్య:— "పుస్తకంలేందే వంటఎలా చెయ్యమంటారు? రోజూ ఆ పుస్తకంచూసి, అందులో ప్రకారమేగా నేను వంట చేసేది?"

ఆమె కులట అని ఆనాడు తలుపు బీగం వేసకొని వెళ్ళారుకాదా? అటువంటి కులటకి నేను ఎన్ని బుద్ధిమాటలు చెప్పినా చెవి కెక్కుతుందా! మీరెలా దాంతో కాపరం సాగిస్తారు? ఆనాటి అనుమానిత రాధ ఈనాడు ఏ కారణంచేత అభిమానపు, అనురాగపు రాధ అయిపోయింది? దయచేసి బాబుని ఇలా ఇచ్చి వచ్చినదారి వెళుతొక్కడం మీకు మర్యాదగా వుంటుంది. నా స్నేహితురాలు నిరక్షరకుక్షి కాదు; మీ వంటి భర్తచేత అవమానించపడి ఆ అవమానం మర్చిపోయి తిరిగీ మీ పాదదాసి అయ్యేందుకు. దానికో దారి చూపాను. తన పాపని అది పోషించుకోగలదు. ఒక్క క్షణం వుంటానికి వీలుండదు. దయచేసి వెళ్ళండి రాధ వచ్చేలోగా......" నా ఉపన్యాసం బాగా విన్నాడు. ఏమనుకొన్నాడో గానీ...బాబుని విడిచిపెట్టి వెళ్ళిపోయాడు. అలా అతను వెళ్ళిపోయినందుకు కాదు వెళ్ళగొట్టినందుకు నేను చాల గర్వపడ్డాను. రాధ వుంటే కొంచానికి ఘటం తొలిగిపోదు... పెద్దరచ్చబండక్రింద నా గది తయారయిపోను!...

రాధ రాగానే గర్వంగా ఆరంభించాను "బాబూ! ఇందాక మీనాన్న వచ్చాడా?" అది ఎందుకో వులిక్కిపడి నావేపు చూసింది. నేను తిరిగీ అన్నాను "రాధా! కాపలెత్తుకొని పారిపోయాడు. ఒకే ఒక నిముషం మాట్లాడాను. అదీ ఎంచినట్లు నాలుగు వాక్యాలు. నాలుగూ గురి తప్పని శరాలు! నీ శత్రువు...అంటే నీ మొగుడు అదే పోక!...ఎంత ఇష్టంగా బాబుని ఎత్తుకొన్నాడనుకొన్నావు......" నేనింకా ఏదో చెపుతుండగనే అది గాబరాగా "నిజంగా వచ్చారా వారు. శారదా! నిజంగా" అని అడిగింది.

"ఆఁ...నిజంగానే వచ్చాడు" నే నడిగిన మాటలు అతడన్న మాటలు చెప్పాను.

"శారదా! నువు మాట్లాడిన వైనం నాకేం బాగాలేదు. ఏమనుకొంటాగో వారు. నేను చెప్పి అడిగించా ననుకోగుకదా! నువిలా మాట్లాడుతావని అనుకోలేదు శారదా! నువే నాకు గర్భశత్రువువి" నే నులిక్కిపడ్డాను. నాకు తెలీకుండా నా చేతులు నా చెవుల్ని మూసినయ్. బాబుని ఎత్తుకొని రాధ వెళ్ళిపోతుంటే గుడ్లప్ప చెప్పుకొని చూస్తూండిపోయాను! శత్రువుని నేనా?



"సలలిత మురళీ నినాదమదిగో మరల వినెదను..."

ఫోటో—ఎస్. ఆర్. ఉమామహేశ్వరరావు, (పార్వతీపురం).



# విజ్ఞానవీధులు

"డాక్టర్"



## 153. భూమివయస్సు ఎంత?

అని జంషెడ్ పురమునుంచి ము. రా. రా. గారట అడిగినారు.

ఈ ప్రశ్నలోనే భూమి అనాది కాదనీ ఎప్పుడో ఒకప్పుడు ఏర్పడిందనీ నమ్మకము కనిపిస్తోంది. అవును అది నిజమే. అయితే 'భూమి' అనగానే, భూగోళమూ, దానిమీదనున్న నీరూ, దానిమీద గాలీ, దాని ఉపరిభాగముమీదనున్న స్థావర జంగమ ప్రాణిసంతతీ, అన్నీ కలిసిన ఈ భూలోకము స్ఫురిస్తుంది. ఇవన్నీ మట్టుకు ఒకసారి పుట్టుకురాలేదు.

సూర్యుడు తన చుటూ తాను తిరుగుతూన్న బ్రహ్మాండమైన వాయుగోళము. ఈ సూర్యునికి చేరువగా ఒక నక్షత్రము యుగయుగాలకు పూర్వము పరిగెత్తింది. ద్రవ్యము ద్రవ్యాన్ని ఆకర్షిస్తుంది కనక, ఈ నక్షత్రము సూర్యగోళపు ద్రవ్యాన్ని, అంటే సూర్యగోళపు వాయువుని తనవేపు లాగింది. కాని ఈ వాయువు కోసుగా లేచి ఆ నక్షత్రాన్ని అందుకోడానికి ముందే ఆ నక్షత్రము దాటిపోయింది. తీరా సూర్యగోళం నుంచి ముందోసకాయ రూపంతో విడిపోయినట్టు వచ్చేసిన వాయువు సూర్యగోళంలాగే సూర్యుడికేంద్రం చుట్టూ తిరగడము ఆరంభించింది. క్రమంగా ఈ వాయువు ఒకచోట గుత్తమూ ఇంకొకచోట పలచనా అయి, ద్రవరూపమై, ఇంకా చల్లబడి ఘనగోళాలై, గ్రహాలుగా తయారైంది. అందుకే ఇవన్నీ (బండి చక్రపు ఆకు పొడుగునీ కట్టబడినట్టు) సూర్యుడి చుట్టూ ఒకే తలము (*Plane*) లో తిరుగుతున్నాయి.

అంటే భూమి వాయుగోళమై, ద్రవగోళమై, చల్లబడి ఘనగోళమై, ఉపరితలము చల్లబడడమువల్ల నీరూ, చెట్లూ, జంతువులూ పుట్టి క్రమంగా ఇప్పటి స్థితికి వచ్చింది. మరి దీని వయస్సు ఎంత? అనడము "భూమి సూర్యుడినుంచి ఎప్పుడు విడిపోయిందీ?" "భూమిమీద రాళ్ళూ కొండలూ (శిల లనడము మేలు) ఎప్పుడేర్పడ్డాయీ?" "భూమిమీద నీరెప్పుడేర్పడిందీ?" "భూమిమీద ప్రాణు లెప్పుడేర్పడ్డాయీ?" అన్న నాలుగు ప్రశ్నలు కట్టిపడెయ్యడము అన్నమాట.

ఈప్రశ్నల్లో ఆఖరిదాన్ని ముందుముందు చెప్పడానికి వదిలి, తక్కిన మూడింటినీ అడుగునించి మొదలుపెట్టి చెప్తాను. భూమి ద్రవగోళమై, ఈద్రవాల తాలూకు ఆవిరులూ నీటి ఆవిరీ దానిని ఆవరించియుండిన యుగాలు గడచిగడచి, భూమి ఉపరిభాగము 100 సెంటిగ్రేడు డిగ్రీల ఉష్ణతకి కిందికి దిగినప్పుడుగాని నీరు ఏర్పడి వర్షించడానికి అవకాశములేదు (100 డిగ్రీల దగ్గర నీరు ఆవిరైపోతుంది కనక) ఇలాగ వర్షించిన మంచినీరు భూమిమీదపడి, ఇంకి, పల్లానికి జారడములో ఎన్నో లవణములను కరిగించుకుని 'సముద్రము'గా ఏర్పడింది. అప్పటి సముద్రపు నీరు ఇప్పటి సముద్రపు నీరంత ఉప్పగా ఉండియుండదు. ఈ సముద్రపు నీరు ఎండకి ఆవిరియైనప్పుడు మంచినీరు మాత్రమే పోయి కరిగిన ఉప్పులు మిగిలిపోతాయి. మళ్ళీ వానాకాలంవచ్చినప్పుడు మళ్ళీ సముద్రాలలో మరికొన్ని ఉప్పులు కలుస్తాయి. వేసవికి మళ్ళీ కొంత మంచినీరు తగ్గి, ఉప్పులు చిక్కనై, ఇలాగ రాగా రాగా నేటికి సముద్రపు నీరు తాను కరిగించుకోగల ఉప్పులో సుమారు పదోవంతు మాత్రమే ఒచ్చే ఉప్పుతో తయారయిఉంది. (సముద్రపు నీటిలో ఇంకా ఉప్పు కరుగుతుంది) ఏడాదికి కొంత పరిమాణముగల సముద్రపునీటిలో ఉప్పు ఎంత జాస్తి అవుతోందీ? అని సోదా చూసి, ఆ లెక్కని ఇప్పుడా పరిమాణంలోని ఉప్పు అందులో చేరడానికి ఎన్నేళ్లు పట్టింది? అని లెక్కవెయ్యడంవల్ల భూమిమీద నీరు ఏర్పడి పదికోట్ల సంవత్సరాలైనదని శాస్త్రజ్ఞులు అంచనా వేశారు.

అయితే శిలలు ద్రవమునుంచి ఎప్పుడేర్పడ్డాయీ? ఈ శిలలలో యురేనియము అనే రేడియో ధార్మికధాతువుంటే, అవి ఎప్పుడేర్పడ్డాయో చెప్పవచ్చును. యురేనియము తన రేడియో ధార్మికతవల్ల అంచీలమీద సీసముగా మారుతుంది. లక్ష యురేనియము పరమాణువులనుంచి, ఒక సీసపు అణువు తయారవడానికి ఎంత కాలం పట్టునో లెక్కకట్టారు. ఏ శిలలోనైనా యురేనియ లవణములభిస్తే, దానిలో యురేనియపు పరిణామమువల్ల సీసము ఎన్ని అణువులున్నదో లెక్కగట్టి, దానినిబట్టి ఆ శిలలో యురేనియము ఏర్పడిన కాలమును లెక్కకడతారు. ద్రవస్థితిలో నున్న యురేనియములో రేడియోధార్మికతవల ఏర్పడ్డ సీసపు అణువులు ఒకచోట నిలవక చెదిరిపోయి ఇంకో పదార్థముయొక్క ద్రవంలోకి తప్పుకుంటాయి. కాని యురేనియము ఘనీభవించేస్తే ఈ సీసపు అణువులు దానిలోంచి తప్పుకోలేవు. కనక యురేనియంలో సీసము ఎంతవున్నదో కనుక్కొని దానిని యురేనియముయొక్క, ఆ శిలయొక్క వయసుకట్టే పద్ధతివల్ల భూమి ఘనీభవించిన నాటికాలము తెలుపుతుంది. ఫిన్లండులోని కెరీలియాలో 1,850,000,000 (నూటఎనభై అయిదుకోట్ల) సంవత్సరాలు వయసుగల శిలలు కనిపెట్టారు. అంటే భూమి ఘనీభవించి, ఈనాటికి రెండువందలకోట్ల సంవత్సరాలు దాటివుండదు. ఇదే భూమి వయస్సు. ★

## చిత్రప్రశ్నలకు జవాబులు

—శాస్త్రాలలోని పదునాల్గు భువనంబులు శాస్త్రకారుల ఊహాప్రపంచంలోనివే. సృష్టిలోనివి కావు.

—చెట్లు ఉన్నచోటినుంచి ఇంకొకచోటికి ఆహారముకోసము ప్రయాణించలేవు. కనక ఆహారము తయారుచేసుకోవలసిన బాధ వాటికుంది. అందుకే కార్బన్ డై ఆక్సైడూ, నీరూ, వెలుతురులోని శక్తి

ఉపయోగించుకుని పిండిపదార్థము తయారు చేసుకుంటాయి.

—ప్రశ్నలు పిల్లలు వేసినా సమాధాన మిస్తారమ్మా సరోజా. కాని సమాధానము అందరికీ తెలిసిన ప్రశ్నలు వేస్తే, మేము సమాధాన మివ్వడము దండుగ కాదూ? అయితే నీ వడిగిన ప్రశ్నమాత్రము గట్టిదే. బుధుడూ, గురుడూ, వంటి గ్రహాలను దూరదర్శినిలో చూస్తే గుండ్రముగా కనపడతాయి. కనక ఖగోళాలన్నీ గుండ్రముగా ఉంటాయన్న శాస్త్రజ్ఞుల ఊహాని మీ మేష్టరుగారు చెప్పారు. నక్షత్రాలు మటుకు అతిదూరంగా ఉండడమువల్ల నేటి దూరదర్శినులలో పెద్దవికావడమే లేదు! 200 రెట్లు పెంచినా చుక్కలు చుక్కలుగానే వుంటున్నాయి! ప్రత్యక్ష ప్రమాణము లేకపోయినా, నక్షత్రాలు గుండ్రంగా వుంటాయన్నదే నిజము. మనవారు నక్షత్రాన్ని రూపంలో వెయ్యడము నక్షత్ర రూపము సూచించడానికి కాదు. నక్షత్రపు వెలుతురన్ని దిశలకీ వ్యాపిస్తుందని సూచించడాని కనుకుంటాను. గ్రహాలు మెరవవు. నక్షత్రాలు మినుకూ మినుకూ మెరుస్తాయి. అందుకని వాటికి కొసలు పెట్టేరేమో.

—అవును సముద్రపు నీటిలో తడిసిన వస్త్రము మంచినీటిలో తడిసిన వస్త్రము ఆరినంత త్వరగా ఆరదు. మంచినీటిని వెచ్చబెట్టితే 100 డిగ్రీల ఉష్ణోగ్రతవద్ద ఆ నీరు మరిగి, ఆవిరి అవుతుంది. సముద్రపు నీటిని వెచ్చబెట్టితే 100 డిగ్రీల దగ్గర మరగదు; 100 డిగ్రీలకన్నా ఎక్కువ వేడిమి ఉంటే గాని మరగదు.

నీరు సలసల మరగకపోయినా తక్కువ ఉష్ణోగ్రత దగ్గర, అదృశ్యంగా ఆవిరి అవుతూనే వుంటుంది. తడివస్త్రపు తడి ఇలాగే ఆరిపోతుంది. ఈరీతిగానే సముద్రపు నీట తడిపిన వస్త్రముకూడా ఆరుతుంది గాని, దాన్నీ దీన్నీ ఆరవేస్తే అప్పటి ఉష్ణోగ్రత మంచినీరు మరిగే ఉష్ణతకి దగ్గిరా, ఉప్పనీరు మరిగే ఉష్ణతకి ఇంకా దూరమూనూ. కనక ఉప్పనీట తడిపిన వస్త్రము మంచినీట తడిపిన వస్త్రమంత సులువుగా ఆరదు.

—నీటిబిందువుద్వారా చొచ్చుకు వచ్చే కిరణాలరంగులు, పట్టకము ద్వారా వచ్చిన కిరణాలరంగుల వంటివే. అది నీరూ, ఇది గాజూ అంతే తేడా.

'అనంతము అంటే ఏమిటి?' అన్న ప్రశ్నకు మేమిచ్చిన జవాబు గుంటూరి కె.ఎ.కుశాలరావుగారికి 'తప్పు'నిపించింది. అనంతము అన్నదానికి విలవ ఇదీ అని చెప్పడము అసందర్భము. అలా చెప్పగలిగితే అది అనంతము కాదు. ఒక సంఖ్యని అర, పాతిక, $\frac{1}{8}$, 1/100 కి భాగించితే లబ్ధము ఎక్కువౌతుందని మనకి తెలుసు. ఇలాగ భాగించే సంఖ్య అతిసూక్ష్మమైపోతే లబ్ధము పెరిగిపోతుంది. అంటే, భాగించే సంఖ్య సున్నాకు చేరువైనకొద్దీ వచ్చేలబ్ధము అనంతమునకు దగ్గరౌతుంది కదా? ఈ భావాన్నే బారుగా "ఒక సంఖ్యని సున్నా పెట్టి భాగిస్తే వచ్చేది అనంతము" అని చెప్పాము. కుశాలరావుగారు $x/0$ అన్న దానికి అర్థములేదన్న వాక్యము ఉటంకించారు. గణితశాస్త్రరీత్యా అది వాస్తవము. 2/0, 3/0, 4/0 అన్నవన్నీ అనంతమేకదా అన్నారు. ఇక్కడ అనంతము అన్నది ఎక్కడో ఒకచోట గీటుగీసుకుని కూర్చున్నదనే అభిప్రాయము వారికి కలిగింది కాబోలు. అది తప్పు. 2/0 అన్నది అలాగ జరిగిపోతూనే వుంటుందిగాని ఒక విలవకడ కూర్చోదు. 2/0 కి అర్థము లేదుకాని 2/y, *Y tending to zero* కి అర్థము ఉంది. అదే అనంతము.

రెండు సమాంతరరేఖలు కాగితము మీద గీశామనుకోండి. 'వాటిని ఇటూ అటూ పొడిగిస్తే అనంతదూరములో కలుస్తాయి' అంటాము. అంటే సమాంతరరేఖలు కలుస్తాయని అర్థమా? "మధ్యదూరము ఎక్కువగా వున్న సమాంతరరేఖలు పొడిగిస్తే కలిసే అనంతము, మధ్యదూరం తక్కువగా వున్న రేఖలు కలిసే అనంతముకన్న చిన్నది కాదా" అని అడిగినట్టుగా కుశాలరావుగారు, 2/0, 3/0, 4/0 ఇవన్నీ అనంతమే అయితే 4=0 × అనంతము, 3=0 × అనంతము అని రాసి, ఈ సమీకరణాల్ని వెనక్కి చదివి 3=4 అని సారాంశము తీశారు. 2/0 గాని, 3/0 గాని అలాగ వెళుతూ ఉండవలసిందే. అవి అనంతాలాయెను. ఆగినప్పుడుగద వాటి విలవల్ని సమీకరణము చెయ్యడము? $x/0$ కి అర్థము లేదంటే, "దాని విలవ ఇంత అని చెప్పలేము. దానికి మనకి తెలిసిన అర్థము లే"దన్న మాట.

—ఒక తాళముచెవిని అయస్కాంతముగా చేసి, దాని కొసకి ఇనపరజను పట్టించండి, ఆ రజను కొసకి కరుచుకుంటుంది. ఇప్పుడు ఆ చెవి 'చెవి'లో వేలుంచి తాళము చెవిని గిరగిర తిప్పండి. ఇనపరజను రాలిపోదు. ఎందువల్ల, అయస్కాంతము పట్టువల్ల. అలాగే భూమి తిరుగుతూన్నప్పటికీ, భూమి తనమీది నీటినీ, జంతువులనీ, రాళ్లనీ తన కేంద్రంవైపు ఆకర్షిస్తూండడమువల్ల ఈ 'వస్తువులు' ఏవీ భూమిని విడిచి 'పడి'పోవు. అలా 'పడ'డానికి ఇంకోవస్తువు వాటిని ఆకాశంలోకి లాగాలి. ఈ ఆకర్షణలు చేరువనున్న భూమి ఆకర్షణ అంత శక్తివంతాలు కాలేవు. అందుచేత నీరూ, మనుష్యులూ ఆకాశంలోకి 'పడి'పోరు.

—స్నానాలు చేసే గదులలో నాచూ, పాకుడూ పుట్టడానికి నీళ్ళుమాత్రమే కారణముకాదు. ఆ గదులలో తవుడూ, గంజీ పోసి కడుగుతూండడము ముఖ్యకారణము. ఈ ఆహారపదార్థాలలో నత్రజని సంకలిత వస్తువుంటుంది. నాచు తాలూకు విత్తనాలనదగిన బీజరజోకణములు (*Spores*) గాలిలో తేలియాడుతూంటాయి. ఇవి స్నానాలగదిలోని తేమకు కొంచెం ముక్కిన నత్రజని సంకలిత పదార్థము మీద పడి, మొలిచి, దానినే ఆహారముగా ఉపయోగించి నాచుగా, పాకుడుగా తయారవుతాయి. ఇవి ఒకటి రెండుగా, రెండు నాలుగుగా, నాలుగు ఎనిమిదిగా, అలాగ రెట్లుగా (*Geometric Progression*) వృద్ధిఅవుతాయి. కనక ఈరోజున నిర్మలంగా వున్న స్నానాలగది రేపటికి పాకుడుపట్టి జారుజారుగా తయారవగలదు. నాచూ పాకుడూ పట్టకుండా వుండాలంటే, కడుగూ, గంజీ పొయ్యకపోడమే కాక, భోజనానంతరము చేతులనూ, కంచాలనూ స్నానాల గదిలో కడగకూడదు.

—అక్కన్న సంగతి మాకు సరిగా తెలియదు గాని మాదన్నను మాత్రము ఔరంగజేబు ఆజ్ఞవల్ల ఏనుగుచేత తల తొక్కించి చంపేరు. తానీషాకి మంత్రిగా ఉండడమూ హిందువు కావడమూ మాత్రమే ఆయన నేరాలు. తానిషాని ద్రోహముచేసి తనతో కలిసిన ముసల్మాను మీర్జుమ్లాకి ఔరంగజేబు సేనాధిపత్యము నిచ్చి గౌరవించాడు. ★

# ముద్దు చెల్లా(



ముద్దురాముని ముద్దు చెల్లాయి

మా స్కూల్లో ముద్దు రాముడిని గురించి తెలియని వాళ్లు వుండరు. అతనికి ఒక చెల్లెలు వుంది — ముద్దురాముని ముద్దు చెల్లాయి! ముద్దుచెల్లాయి నిజంగా ముద్దే ఎప్పుడూ ఏం అల్లరి చేద్దామా! ఎక్కడ అల్లరిపిల్లలు గుమిగూడుతారా? అని దీర్ఘంగా ఆలోచిస్తూ ఉండేది.

కాని ఆపిల్ల తమ్ముడు మాత్రం చక్కగా బొమ్మల పుస్తకాలు చూస్తూ, ఏ అల్లరీ చెయ్యకుండా, వుండేవాడు.

ముద్దుచెల్లాయికి మటుకు పు
కం చూస్తే, కడుపునెప్పి కాలుపీ
ఒకటేమిటి? అన్నీ ఒక్కమ
వచ్చేసేవి. బుంగ మూతిపె
పుస్తకాన్ని విసిరి కొట్టేసేది.

ఒకరోజున ఆడిఆడి ఇంటి
వస్తూంది ముద్దుచెల్లాయి. దారిల
పెద్ద గేటు కనిపించింది.
కాంపౌండులో ఏముంటాయో న
దాగా చూద్దామనుకుంది. కాన
ఆ గేటుకి కట్టిన అట్టమీ
ఏం రాసుందో ముద్దుచెల్ల
యికి తెలుస్తేగా! ఆ అట్టమీ
"పొగరుబోతు ఎద్దువుంది
జాగ్రత్త" అని వ్రాసివుంది. అ
రం ముక్కైనా రాని ముద్దుకి

చిట్టి తమ్ముడు



# కథ





మొద్దు చెల్లాయి చదువు

మిటో తెలుస్తేగా. కష్టపడి గేటు ఎక్కి లోపలికి దిగింది. దిగీదిగడం తోటే, తెలిసొచ్చింది—ఆ గేటుకి తాళం ఎందుకు వేశారో. లోప లున్న ఎద్దు కాలుదువ్వి మీాదకు వస్తే, భయంతో ఒణికిపోయింది మొద్దుచెల్లాయి.

ఎలాగో, చిన్నచిన్న దెబ్బ లతో బయటపడింది. దారిలో అనుకుంది— ఇంకెప్పుడూ మూసి వున్న గేట్లవూసుకి పోకూడదని. అంతేకాని, 'అక్షరాలు నేర్చుకుందాం, ఇలాంటి ప్రమాదాలు రావు' అని మాత్రం అనుకోలేదు.

ఈ కథ గట్టిగా యింటిదగ్గర చదవకండి సుమీా! మీా మీా చెల్లాయిలు దెబ్బలాటకి వస్తారేమో!





మొద్దు చెల్లాయికి ఎద్దు పాఠం నేర్పింది

# బొమ్మరిల్లు

## ఇష్టం



డి. చంద్రలేఖ

చందమామ కన్న,
కుక్కపిల్ల కన్న,
జొన్నపొత్తు కన్న,
చాక్లేట్లు నాకిష్టం—

బడికన్న, చదువుకన్న,
అమ్మచెప్పే కథలకన్న,
వానవస్తె మాదొడ్లో
కాలవలో నడిచివెళ్లే
కాగితం పడవలంటే
నాకు బలేబలే యిష్టం—

దీపావళి టపాకాయలకన్న,
నా ప్లాస్టిక్ బుల్లిపాపకన్న,
పేరంటంలో పచ్చిశనగలకన్న,
నిజంగా
అమ్మా నాన్న అంటే
ఆకాశమంత యిష్టం—

## మా పల్లె



బొడ్డపాటి రాజా

మాపల్లె కొస్తారా?
మావూరు చూస్తారా?

చక్కనౌ రిక్కలతో
సరసమాడేటి
గాలిగోపుర మొకటి
గంభీరముగనుండు

ఆలయముకాప్రక్క
మెల్లమెల్లనపాఱు
చల్లటి సెలయేఱు
తల్లివలె మాకుండు

మధురమౌ ఫలములతో
బంగారు పంటలతో
జయమునిచ్చే క్షేత్రలక్ష్మి
సింగార మొలికించు.

పల్లెవాసులమనసు
పాలసంద్రపుతీరు
మాపల్లె కొస్తారా!
మావూరు చూస్తారా?



బొమ్మరిల్లు సీరియల్

అద్దెబోటులో-

# ముచ్చటగా ముగ్గురు

## (కుక్క సంగతి సరే సరి!)

(గత సంచిక తరువాయి)

ఆరోజు—అంటే మా ప్రస్తుత ప్రయాణసందర్భంలో మేము 'స్ట్రీట్లీ' చేరిన రోజు-మధ్యాహ్నం, నేనూ జార్జీ (హారిస్సు ఏమైనాడో తెలియదు: వూళ్లోకి వెళ్లి క్షౌరం చేయించుకు వచ్చి భోంచేసి పక్కా అరగంటసేపు కూర్చొని బూట్లకి పాలిష్ వేసుకొని ఎక్కడికో పోయాడు.)—నేనూ, జార్జీ, (కుక్క మా పాలనే పడ్డది కాబట్టి) ఆకుక్కా—ముగ్గురమూ విల్లింగ్‌ఫర్డ్ వూళ్ళోకి వెళ్లాం. తిరిగి తిరిగి అలసిపోయి ఒక హోటల్లోకి వెళ్లి కూర్చున్నాం

మేము కూర్చున్న బల్లకి దగ్గరలోనే చుట్ట కాల్చుకొంటున్న ముసలాయన ఎవరో కూర్చొని వున్నాడు. ఆయనతో పిచ్చాపాటీ మొదలుపెట్టాము.

ఆ మాటా యీ మాటా మాట్లాడాక ఎందుకనో యింక మాట్లాడటానికి ఏదీ లేకుండా పోయింది ఏమీ తోచక హోటల్ గోడలవంకా, చూరువంకా చూస్తూ వుండిపోయాం. అలా చూస్తుండగా ఒక గోడమీద చాలా ఎత్తున గాజు పలకలతో అమర్చిన పెట్టె ఒకటి తగిలించివుండటం మా కంటబడింద. దాంట్లో పెద్ద సొరచాప వున్నది. అంత పెద్ద చేపని చూసి నేను చాలా ఆశ్చర్యపోయాను.

"చాలా పెద్ద చేప కదండీ అది!" అన్నాడు ఆ ముసలాయన, నేను చూస్తున్న వేపే తనూ చూస్తూ.

"మరే! అంత పెద్ద చేపని నే నెక్కడా చూడలేదు" అన్నాను, పైకి వినిపించీ వినిపించనట్లు. జార్జికూడా దానివంక చూస్తూ, 'ఆ చేప ఏమాత్రం తూగుతుందంటార'ని ఆ ముసలాయన్ని అడిగాడు.

"అరవీశె! రేపు ఒకటో తారీకుకి దాన్ని నేను పట్టుకొని యిప్పటికి సరిగ్గా పద్దెనిమిది సంవత్సరాలు కావస్తోంది. అదుగో—ఆ కనుపించే బ్రిడ్జిదగ్గరే దీన్ని పట్టుకొన్నాను. పెద్దచేప ఏదో ఆ ప్రాంతాల్లో తిరుగుతోందని నలుగురూ చెప్పుకోవటం మొదలెట్టారు. ఆ వార్త నా చెవిని పడగానే, గాలం పట్టుకువెళ్లి ఒక్క పూటలో పట్టి యివతలపడేశాను. ఈమాదిరి చేపలు యిప్పుడు యీ ప్రాంతంలో విరివిగానే వుంటున్నాయనుకొంటాను. వెళ్లొస్తాను. శెలవా మరి?" అంటూ ఆ పెద్దమనిషి తన కోటూ గట్రా సర్దుకొని వెళ్లిపోయాడు.

ఆయన వెళ్లాక ఎంతసేపటికీ మాకు మాట్లాడేందుకుకూడా, ఓపిక లేకుండా పోయింది. అలా విడవకుండా, ఆ చేపవంకే చూస్తూ వుండిపోయాం. నిజంగా అది చాలా పెద్దచేప. మేము అల్లా దానివంక చూస్తుండగా, సీసా ఏదో చేత్తోపట్టుకొని మరో పెద్దమనిషి హోటల్ లోపలికి వచ్చాడు. అతనూ మేము


మూలం: జెరోమ్ కె. జెరోమ్



అనువాదం: విశ్వాత్ముల నరసింహమూర్తి



# ముచ్చటగా ముగ్గురు



చూస్తున్న చేపవంకే చూస్తూ మా పక్కనే నిలబడి పోయాడు.

"చాలా పెద్దచేపకదండీ!" అన్నాడు జార్జి, మర్యాదగా వుంటుందికదా అని.

"ఆ మాట వేరే చెప్పాలాఅండీ?" అంటూ సీసా బిరడాతీసి మరి కాస్త గొంతులో పోసుకొని, సీసామూత బిగిస్తూ ఆ పెద్దమనిషి "ఈ చేప పట్టుబడ్డప్పుడు మీరు యీ వూళ్లో లేరుకాబోలు?" అన్నాడు.

మేమూ వూరికి కొత్తగా వచ్చినవాళ్లమని చెప్పుకొన్నాం.

"ఆఁ! అల్లాచెప్పండి. మీకు ఎలా తెలుస్తుంది, పాపం? దాన్ని నేనే పట్టాను ఇప్పటికి సరిగ్గా ఐదేళ్లయింది!" అన్నాడు ఆ వ్యక్తి.

"అయితే దీన్ని పట్టింది మీరా?" అని అడిగాను నేను, ఆశ్చర్యపోతూ.

"మరేనండీ!— అదిగో ఆ కనిపించే లాకు లేదూ?—దానిపక్క దీన్ని పట్టాను. ఆరోజు గాలానికి నేను పెద్ద ఎరనికూడా తగిలించలేదు సుమండీ! అక్కడే యేదో చిన్న ఈగ చచ్చిపడివుంటే దాన్ని తీసి గాలానికి గుచ్చి నీట్లో పడేసి కూర్చున్నాను. అల్లా పడేశానో లేదో, పెద్ద చేపా నాగాలానికి తగులుకు వూరుకొంది.... వస్తా, మరి సెలవా?" అంటూ ఆయన వెళ్ళిపోయాడు.

మరొక ఐదు నిమిషాలు గడిచేసరికి యింకో పెద్ద మనిషి మా దగ్గిరికి వచ్చి, అదే చేపని తాను ఏవిధంగా పట్టిందీ అదంతా పెద్ద కథగా చెప్పి వెళ్లి పోయాడు. ఆయన వెళ్లిన మరొక ఐదు నిమిషాలలో కాస్త బుద్ధిమంతుడులా కనిపించే నడి వయస్సు మనిషి యింకొకాయన వచ్చి మా పక్కనే కూర్చున్నాడు.

ముందు కొంచెంసేపు మేమెవరమూ మాట్లాడలేదు. జార్జి, ఎలాగో కొంత ధైర్యం తెచ్చుకొని, చొరవ చేసుకొని ఆయనదగ్గిరిగా జరిగి "చూశండీ—మేము యీవూరికి కొత్తవాళ్లం: మామీద కాస్త దయ తలంచి, తమరు యింత పెద్ద చేపని ఎలా పట్టేరో కొంచెం ఓపిక చేసుకు చెప్పగలరా?" అని అడిగాడు.

"నేను పట్టానని మీ కెవరుచెప్పారు?" అని ఆ నడివయస్సు మనిషి అడిగాడు.

మాకు ఎవరూ చెప్పకపోయినా, యింత పెద్ద చేపని పట్టితే తనే పట్టివుంటాడని మా కనిపించిందనీ, అందుచేత అల్లా అడిగామని మేము సమాధానం చెప్పాం.

"చాలా బాగుంది: చాలా బాగుంది. మీ వూహ సరైందే సుమండీ! దీన్ని నేనే పట్టాను. ఐనా మీరు అంత అవలీలగా ఆ విషయాన్ని వూహించగలగడం మాత్రం నిజంగా చాలా గొప్ప విశేషం. అందులో ఏమీ సందేహం లేదు!" అంటూనే ఆయన తనా చేపని ఏవిధంగా పట్టిందీ, దాన్ని పట్టేలోగా ఆ బరువుకి ఆగలేక గాలం ఎలా విరిగిపోయిందీ, అదంతా పెద్దకథగా చెప్పుకొచ్చాడు. అలా చెప్పి చెప్పి చివరకి మాదగ్గిర సెలవు తీసుకొని వెళ్లిపోయాడు.

ఆయన వెళ్లిన మరో కొద్దినిమిషాల్లో హోటల్ యజమాని మా దగ్గిరికి వచ్చాడు. ఇంతసేపూ ఎంతమంది యీ చేపని తామే పట్టినట్లు చెప్పుకొచ్చారో ఆ కథలన్నీ మేమూ హోటల్ యజమానికి చెప్పాం. అందరమూ కలసి కాస్సేపు విరగబడి నవ్వుకొన్నాం.

"హాఁ! హాఁ! హాఁ!......హీ...హీ...హీ... వీళ్లుటండీ యింత పెద్దచేపని పట్టేదీ? పట్టినా యిలాంటి వాళ్లు నాకు యిస్తారా?" అంటూ ఆ హోటల్ యజమాని ఒకటే నవ్వు!

గుక్కబట్టి నవ్వి నవ్వి, ఎప్పటికో కాస్తవూపిరి పీల్చుకొని ఆ చేప తాలూకు అసలు చరిత్ర చెప్పటం మొదలుపెట్టాడు. ఆ చేపని తానే తన చిన్నతనంలో పట్టానన్నాడు. అదైనా స్కూలు ఎగగొట్టి, ఏం చెయ్యటానికీతోచక తిరుగుతూ, ఒకనాటిమధ్యాహ్నం యీ పని చేశాడట. ఆ సమయంలో తనదగ్గిర చేపలు పట్టే గాలంకూడా లేదట. ఊరికేనే నది ఒడ్డునవున్న ఒక చెట్టుకొమ్మకి అంతపొడుగు దారం ఒకటి కట్టి, దాని చివరని వొంగిపోయిన తుప్పుమేకు ఒకటి తగిలించి నీళ్లల్లో పడేసి చూస్తూ కూర్చున్నాడట. దీని తస్సాదియ్యా—యింత పెద్ద చేపా యిట్టే పట్టుబడిపో

యుందట! అంత పెద్ద చేపని అంత అవలీలగా పట్టినందుకు వాళ్ల మేష్టారు కూడా మెచ్చుకొన్నాడట.

కబుర్లు చెప్పటం యింతవరకు వచ్చేసరికి హోటల్ పనివాడెవడో యీయనను పిలిచాడు. దాంతో ఆయన మమ్మల్ని వదిలిపెట్టి వెళ్లాడు.

నేనూ, జార్జి మళ్లీ మోరలు పైకెత్తి ఆ చేప వంకే చూస్తున్నాం.

నిజంగా అది చాలా పెద్ద చేప. దానివంక చూస్తున్నకొద్దీ, మాకు ఆశ్చర్యం ఎక్కువౌతున్నది:

జార్జి మనస్సు వుండబట్టలేక, అక్కడ ఒక కుర్చీవుంటే, దాన్ని తెచ్చి, గోడకి ఆనించివేసి దాని మీదికి ఎక్కాడు—యింకా దగ్గిరనుంచి ఆ చేపని చూసి సంతోషిద్దామని.

ఉన్నట్లుండి వాడు ఎక్కినకుర్చీ జరిగింది. పడబోయినవాడు, మరేమీ తోచక, చేపను పెట్టి వుంచిన ఆగాజు బీరువానే గట్టిగా వాటేసుకొన్నాడు. ఫెళఫెళమని చప్పుడు అయింది. జార్జితోపాటు, గాజు బీరువా, అందులోని చేపా అన్నీ కిందరాలాయి.

"కొంపదీసి చేప చెడిపోలేదుకదా?" అంటూ నేను వాడిదగ్గిరకి పరిగెత్తాను.

"ఏమో! చెడిపోలేదనే అనుకుంటాను." అన్నాడు జార్జి, మోకాళ్లు పట్టుకు పైకిలేస్తూ.

చెడిపోకపోవట మేమిటి — అంత పెద్ద చేపా వెయ్యిముక్కలైంది. వెయ్యిముక్కలైందని మాట వరసకి అన్నాను. కాని నిజానికి తొమ్మిదివందల తొంభైతొమ్మిదిముక్కలుమాత్రమే అయివుండవచ్చు. నేనుమాత్రం లెక్కపెట్టలేదు.

నిజం చేపఅయితే, అల్లా ముక్కలు కాదు. అది సరే. కనీసం చచ్చినవాటి పొట్టచీల్చి, అందులో గడ్డీ రంపపుపొట్టూ వగైరా దినుసులన్నీ దట్టించి మళ్లీకుట్టేసిపెట్టుతారే—ఆ బాపతేమోననుకొన్నాను. అదైనాకూడా యిలా పప్పు పప్పు కాదే?

తీరాచూస్తే అది నామసుద్దతో తయారుచేసి పెట్టిన చేపబొమ్మ కాని మరొకటి కాదు!

(ఇంకావుంది)

# అర్థంకాని విషయం

"ఏమిటిరా! పొద్దుట్నుంచి అదోలా ఉన్నావు?" అన్నాడు రవి, విష్ణు మొఖంలోకి చూస్తూ.

"ఏం లేదు" అన్నాడు విష్ణువర్ధన్ బాబు.

ఏం లేదన్నప్పటికీ ఏదో తప్పకుండా ఉందనుకొన్నాడు రవివర్ధన్ రావు.

* * *

విష్ణువర్ధన్ బాబు కొత్తగా ఫస్ట్ ఫారంలో చేరినప్పుడు వచ్చి తన ప్రక్కనే కూర్చున్నాడు. రవిదీ, విష్ణుదీ యిద్దరిదీ ఒకే వయసు. ఒకే క్లాసు. ఇద్దరికీ మంచి స్నేహం కలిసింది. ఎవరు, ఎవర్ని ముందు మాట్లాడించారో, ఎవరికీ తెలియదు, కాని, వాళ్లుమాత్రం ఒకర్ని విడిచి, ఒకరు ఎప్పుడూ ఉండేవారు కాదు. విష్ణు స్కూలికి రాకపోతే రవి రాడు. రవి రాకపోతే విష్ణు రాడు. చదువులో మాత్రం ఫస్ట్ మార్కులెప్పుడూ రవివే. విష్ణు సెకండు. ఎప్పుడూ వీళ్లకే ఫస్టు, సెకండు మార్కులు రావడంమూలంగా మిగిలినవాళ్లకి ఉక్రోషంగా ఉండేది. అయినా వీళ్లిద్దరూ కలిస్తే వాళ్లో లెఖ్ఖా? విష్ణు తమాషాగా "నేను డాక్టరు నవుతాను. నువ్వు కంపౌండరుగా ఉండు." అంటే, రవి నవ్వుతూ, "నేను ప్లీడరు నవుతాను. నువ్వు గుమాస్తాగా ఉండు." అనేవాడు.

ఎక్కడి కెళ్లినా ఇద్దరూ కలిసి వెళ్లవలసిందే. వాళ్ల ఇంగ్లీషు మేష్టారు వీళ్లకి తమాషాగా 'మిత్రద్వయం' అని పేరుకూడా పెట్టారు. ఇద్దరూ అలా కలిసి చదువుకుంటూనే నెహ్రూ అంత పెద్దవాళ్లయిపోవాలని గాంధీ అంత గొప్పవాళ్లయిపోవాలని.......... ఇంకా ఇంకా ఏవేవో ఐపోవాలనీ అనుకొనేవారు. కాని హైస్కూల్లో

నిడదవోలు మాలతి

ప్రవేశించి హైయర్ ఫారంలో కాలుపెట్టకుండానే విఘాతం వస్తుందని విష్ణు ఎప్పుడూ అనుకోలేదు. ఆమాటకొస్తే రవి మాత్రం అనుకున్నాడేమిటి, విష్ణునాన్నగారికి ట్రాన్స్ఫర్ అనేది ఒకటి ఉంటుందని, అది తమను విడదీస్తుందనీ!

* * *

"పోనీ, ఇంకొన్నాళ్లు ఇక్కడే ఉంటానని మీ నాన్నగారు పై ఆఫీసరుకి ఉత్తరం రాస్తే?" అన్నాడు రవి, సాలోచనగా.

"ఊహుఁ. లాభం లేదురా. మూడేళ్లకంటె ఎక్కడా ఉండనివ్వరు."

ఒక నిముషం ఎవరూ మాట్లాడలేదు.

"మా అమ్మనడిగి నేనూ ఈ ఊళ్లోనే ఉండిపోనా?" అన్నాడు విష్ణు ప్రశ్నార్థకంగా చూస్తూ.

"మీ ఇంట్లోనే ఉండిపోతాను. హాయిగా ఇద్దరం కలిసి చదువుకోవచ్చు."

గాలిలో తేలిపోతున్నట్టు మాట్లాడుతున్నాడు విష్ణు.

రవి ఆ మాటలకి ఆశ్చర్యపోలేదు. ఆలోచనల్లో పడ్డాడు. "ఉండు" అంటే ఉండిపోతాడు కాని వాడెక్కడ? తనెక్కడ? తన ఇంట్లో కుర్చీ కాదు కదా, ఓ స్టూలైనా లేదు. వాళ్లింటినిండా సోఫాలే. వాళ్ళింట్లో మహాదర్జాగా ఉంటుంది. వాడికి వాళ్ళింట్లో జరిగిన దర్జాల్లో సగంకూడా తనయింట్లో జరగవు. అయినా ఉండమంటే ఉండిపోతాడు. కాని......

"శలవుల్లో మళ్ళీ ఈ ఊరొస్తావుగా?" అన్నాడు రవి.

* * *

మర్నాడు రవి స్టేషన్ కెళ్లొచ్చాడు. వాడి స్థితికి జాలిపడ్డ తల్లి ఓదార్పుగా అంది, "ఊరికే అలా ఇదైపోతా వెందుకు; నీకోసం వాళ్లు ఉండిపోతారేమిటి? ఆ డాక్టరు వెళ్లిపోతే ఇంకో డాక్టరు వస్తారు." అంది. రవికి అమ్మమాటలు నచ్చలేదు. ఆయన వెళ్ళిపోతే ఇంకోళ్లు వస్తారు. నిజమే కాని ఇంకో 'విష్ణు' రావొద్దూ? ప్రపంచంలోని

అందరూ ఒక్క 'విష్ణు'కి సాటి రారనుకున్నాడు రవి. విష్ణు వాళ్లమ్మ ఎంతమంచిది? వాళ్లమ్మని తల్చుకునేసరికి కళ్లనీళ్లు తిరిగేయి రవికి. తను బీదవాడైనా వాళ్ల విష్ణుతో సమానంగా చూసేది. రసగుల్లాలు, జిలేబీలు, బాదంహల్వా...ఎన్నో ఇచ్చేది. ఇంతెందుకు. ఓమాటు విష్ణు పుట్టినరోజు వస్తే వాడితో పాటు తనకి కూడా ఓ లాల్చీ, నిక్కరు కొనియిచ్చింది. ఆవిడ ఎప్పుడూ సుఖంగా ఉండాలని తనకి తెలిసిన దేవుళ్లని మనసులో ప్రార్థించాడు. మరి కొత్త డాక్టరుగారి భార్యకూడా అలాంటి దానో కాదో? వాళ్లింట్లో కూడా ఓ విష్ణు వున్నాడో లేడో? ఉన్నా ఆ కొత్తకుర్రాడు తన స్నేహితుడు ఎలా అవుతాడు? అమ్మకసలు ఏం తెలియదనుకున్నాడు రవి.

సాయంత్రం శ్రీధర్ వచ్చాడు. శ్రీధర్ తనకంటె వయసులో రెండేళ్లు పెద్ద. క్లాసులో ఒక ఏడు చిన్న. క్లాసులో అంతా వాడ్ని "ఆలిండియా రేడియో" అంటారు. ఎలా తెలుస్తాయో కాని, వాడికి తెలియని సంగతి అంటూ వుండదు. సోషల్ మేష్టారు కూడా, "పత్రికా విలేఖరిగా ఉంటే బాగా పనికొస్తావురా" అనేవారు. అయినా వీడు రవికిమాత్రం ముఖ్య స్నేహితుల్లో ఒకడు.

"ఏంరా?అలాగున్నావు?" తెలిసీ, తెలియనట్టు అడిగేడు శ్రీధర్.

"ఏంలేద"న్నాడు రవి. కాని కడుపులో దుఃఖం దాచుకోలేకపోయాడు. జరిగిందంతా చెప్పాడు. అంతా విని, "సొంతడబ్బా బాగా వాయించుకుంటాడు" అన్నాడు.

రవికి పట్టరాని కోపం వచ్చింది.

"నీకోసం వాళ్లమ్మా, నాన్నగారిని నూరుమైళ్లదూరంలో వదిలేసి ఇక్కడుంటాడేమిటి? అయినా ఉండమనలేకపోయావ్ తెలిసేది బలం. అన్నీ డాబులు".

"ముయ్యరా. నోరు." ఘాటిగా అరిచాడు రవి.

"రేపు జవాబ్లని మాట్లాడదాంలే" అన్నాడు వెక్కిరింపుగా శ్రీధర్.

ఐదునిమిషాలు ఎవరూమాట్లాడలేదు.

రవికి అక్కడుండడం యిష్టంలేదు.

"పోనీ నువ్వన్నట్టుగానే ఉండమన్నా ఉండడనుకుందాం. నేను వాడ్ని ఇక్కడుండి కష్టపడమంటానో, లేక అక్కడికే వాళ్లమ్మా, నాన్నగారితో వెళ్లి హాయిగా ఉండమంటానో అని వాడే నన్ను పరీక్షించడానికి అడిగాడని ఎందుకనుకోకూడదు? అసలువాడెలాంటివాడో నాకు తెలుసు. వాడు చాలామంచివాడు. నీగుణాన్ని నువ్వేకనబర్చుకున్నావ్ అంతే!" అంటూ రవి అక్కడినుంచి లేచి వెళ్లిపోయాడు.

పన్నెండేళ్ల రవి వేసిన ప్రశ్న ఆరాత్రంతా ఎంత తన్నుకున్నా శ్రీధర్‌కి నిద్రపట్టకుండా చేసింది. అప్పటికీ, ఇప్పటికీ, ఎప్పటికీ శ్రీధర్‌కి విష్ణువర్ధన్ బాబు, రవివర్ధన్ రావునే పరీక్షించాడో, రవివర్ధన్ రావే విష్ణువర్ధన్ బాబుని పరీక్షించాడో అర్థం కాలేదు. ★

# సైకిల్ వేదాంతం

ముతికి భాగీరావు

అనగనగా ఒకవూళ్లో ఒకడుండేవాడు. అతడికి ఒక సైకిల్ వుండేది. ప్రతిరోజూ అతడు సైకిలు మీదనే తిరుగుతుండేవాడు. ఒకనాడు అతడు ఒక షాపుకి వెళ్లాడు. సైకిలు వాకిట్లోనిలబెట్టి, షాపులోకి వెళ్లి, వస్తువులు కొని, ఆ వస్తువులన్నీ ఒకబండిలో వేసి తనూ ఆబండీలో ఎక్కి తిన్నగా ఇంటికి వెళ్లాడు.

ఇంటికి వెళ్లాక అతని భార్య "ఏమండీ, మీ సైకిలు ఏదీ?" అని అడిగింది. వెంటనే ఆషాపుదగ్గిరికి పరుగెత్తుకెళ్లి చూశాడు. సైకిలు అక్కడే వుంది. సైకిలు దొరికినందుకు సంతోషించి, దేముడికి ధన్యవాదాలు అర్పించటంకోసం అతడు త్రోవలో వున్న గుడికి వెళ్లాడు. గుడిలోనికి వెళ్లేముందు తన సైకిల్ని గుడిద్వారందగ్గర వుంచి, లోనికి వెళ్లాడు. గుడిలో, "హే! దైవమా! నీకు నామీద ఎంత దయ! షాపుదగ్గర మరచిపోయిన సైకిల్ను పోకుండా నీవేకదా కాపాడేవు! నీకు యివే పదివేలదండాలు" అని ఒక కొబ్బరికాయ కొట్టాడు. ప్రసాదం పుచ్చుకొని, గుడిబయటికి వచ్చాడు. తన సైకిలు అక్కడలేదు! కళ్లంట నీళ్లు గార్చుకుంటూ దేముడ్ని నిందిస్తూ ఇంటికి వెళ్లిపోయాడు. ★

# ప్రేమచంద్ బాల్యం

చిన్నతనపురోజు లెంత ఆనందంగా వుంటాయి! ఆరోజులు మరుద్దామన్నా మఱపుకు రావు. ఆ ఒంటిమీద బట్టలేనా లేకుండా తిరగటం, ఆ మట్టి యిల్లు, గడ్డి పరుపులు, కాళ్లకు జోళ్లులేకుండా తిరగటం, మామిడిచెట్లెక్కటం, ఆ సంగతులన్నీ ఎప్పుడూ కళ్లముందు తిరుగుతూ వుంటాయి. ఆ వూరి మాదిగ కుట్టిన చర్మపు జోళ్లు తొడుక్కున్నప్పుడు కలిగే ఆనందం, యిప్పుడు 'ఫ్లెక్సు' బూట్లు తొడుక్కున్నా కూడ కలుగదు. అప్పుడా బెల్లపు పానకంలో వుండే రుచి యిప్పుడు మంచి షరబత్‌లలో కూడా వుండదు. ఆ శనగలు, బఠాణీలు కొనుక్కు తినటంలో వుండే మజా, యిప్పుడు రుచికరమైన మిఠాయిలలో కూడ లేదు.

నేనూ మా పినతండ్రికొడుకు హలధరుడూ కలసి పొరుగూరిలో ఒక మాష్టారుదగ్గర చదువుకోటానికి రోజూ వెళుతూ వుండేవాళ్లం. నాకప్పుడు ఎనిమిదేళ్లుంటాయి. హలధరుడు నాకంటె రెండేళ్లు పెద్ద. మేం ప్రొద్దున్నే చద్దన్నం తిని, మధ్యాహ్నానికి వెన్న, వేయించిన బియ్యం తీసుకుపోతూ వుండేవాళ్లం. ఇక చూసుకోండి రోజంతా మాదే. మా మాష్టారు దగ్గర హాజరు పుస్తకమయితే ఏమీ లేదు, సరేకదా గైరుహాజరయినందుకు జుర్మానా కూడా ఏమీ పడేది కాదు. ఇక మాకు భయం దేనికి? ఒకసారి పోలీస్ స్టేషన్ ఎదుట నిలబడి, పోలీస్‌ల డ్రిల్లు చూస్తూండేవాళ్లం. ఇంకొకసారి కోతుల్ని, ఎలుగుబంట్లని ఆడించే వాడివెంట తిరుగుతూ రోజంతా గడిపేవాళ్లం. ఒక్కొక్కసారి రైల్వేస్టేషన్‌లో ఒచ్చే పోయే రైలు బళ్లని చూస్తూ గడిపేవాళ్లం. ఆ రైలుబళ్ల టైమ్‌ల గురించి మాకు తెలిసినంత, బహుశా ఆ టైమ్ టేబులుకికూడ తెలిసివుండదు. మేం

హిందీవ్యాసానికి అనువాదం:

## పారుపూడి కనకం

వెళ్లే త్రోవలో ఆ ఊరి షాహుకారొకడు ఒక తోట నాటించటం మొదలుపెట్టాడు. దాంట్లో అప్పుడు ఒక నుయ్యి కూడ త్రవ్వుతూవుండేవారు. అది కూడ మా కాలక్షేపానికి కారణమైంది. ఆ తోటమాలి మమ్మల్నెంతో ప్రేమతో తన గుడిసెలో కూర్చోపెట్టుకుంటూండేవాడు. మేం వాడితో దెబ్బలాడైనా సరే వాడికి పనిచేసి పెడుతూండేవాళ్లం. ఒకసారి మొక్కలికి నీళ్లుపోసేవాళ్లం. ఒకసారి మొక్కలికి గొప్పులు త్రవ్వేవాళ్లం. ఒకసారికత్తెరతో మొక్కల ఆకుల్ని సమానంగా కత్తిరించేవాళ్లం. ఆ పనులు మాకెంత ఆనందంగా వుండేవి! పిల్లల ప్రకృతితో పూర్తిగా పరిచయమున్నవాడు. మాలి మా చేత పనంతా చేయించుకునేవాడు. కాని అదంతా మాకోసమన్నట్టుండేవాడు. అతడు రోజంతా చేసేపనిని మే మొక గంటలో చేసేవాళ్లం. యిప్పుడా మాలి లేడు కాని ఆతోటమాత్రం ఫలవంతంగానే వుంది.

మే మొకప్పుడు వారాల తరబడి స్కూల్‌కి గైరుహాజరయ్యేవాళ్లం. కాని ఎలాటి సాకులు చెప్పేవాళ్లమంటే, మా మాష్టారికోపమంతా ఒక్క దెబ్బని చల్లబడి పోయేది. అప్పటి కల్పనాశక్తే యిప్పుడుంటే అందరూ ఆశ్చర్యపోయేలా నవలలు వ్రాసి పారేద్దును కాని యిప్పుడు ఎంతో బుర్ర బద్దలు కొట్టుకుంటేనే కాని ఏదీ తోచదు. సరే, ఆ గొడవల్లా వుండనివ్వండి. మామాష్టారసలు దర్జీపని చేసేవారు. మాష్టరుగిరీ కేవలం సరదాకి చేస్తూండేవారు. మే మిద్దరం మావూరి కుమ్మరి, కమ్మరి మొదలైనవాళ్లవల్ల ఆయనకి బాగా రాబడి కలిగిస్తూండేవాళ్ళం. లేకపోతే యిల్లాకూడ చెప్పచ్చు, మేం మామాష్టారి 'ట్రావిలింగ్' ఏజంట్లం. మా ప్రయత్నంవల్ల మా మాష్టారికేదయినాపనిదొరికితే మేం ఆనందం పట్టలేకపోయేవాళ్లం. ఏమీ దొరకనిరోజుని మాష్టారికి ఒక మంచి బహుమతి తీసుకుపోయేవాళ్లం. ఒకసారి శేరో, అర్థశేరో కందికాయలు

కోసి పట్టుకు వెళ్ళేవాళ్ళం. ఒకసారి అయిదో ఆరో చెఱుకులు, ఇంకొకసారి జొన్న కంకులో, గోధుమ కంకులో తీసుకుపోయేవాళ్ళం.

వాటిని చూడగానే మాష్టారి కోపం శాంతించిపోయేది. ఒకొక్కప్పుడు ఈ వస్తువులు పండే రోజులు కాకపోతే శిక్ష పడకుండా తప్పించుకొనేందుకేదో వుపాయం మాత్రం ఆలోచించేవాళ్ళం. మా మాష్టారికి పక్షుల్ని పెంచడమంటే చాలా సరదా. స్కూల్లో కోకిలా, బుల్‌బుల్ మొదలయిన పక్షుల పంజరాలు వ్రేలాడుతుండేవి. మాకు పాఠాలుజ్ఞాపకమున్నా లేకపోయినా వాటికి మాత్రం తప్పకుండా జ్ఞాపకం వుండేవి. మాతోబాటు అవి కూడా చదువుకునేవి. ఆ పక్షులికి సెనగపిండి కలపటంలో మాత్రం మేం మంచి ఉత్సాహం చూపించేవాళ్ళం మా మాష్టారు ఆ పక్షులు తినటానికి పురుగుల్ని పట్టి తీసుకు రమ్మని పిల్లలందరికీ తాకీదు యిస్తూ ఉండేవారు. ఒకొక్కప్పుడు మా విషయం ఆ పురుగుల మీదకు పోయేది. ఆ పురుగుల్ని బలివేసి మాష్టారి రౌద్ర రూపాన్ని ప్రసన్నం చేసుకునే వాళ్ళం.

ఒకరోజున ప్రొద్దున్నే ముఖం కడుక్కోటానికి వెళ్ళినప్పుడు చెఱువుదగ్గర పాలధరుడు తన గుప్పిట్లో ఏదో తెల్లని వస్తువు చూపించాడు. నేను బలవంతాన్ని గుప్పిట తెరచి చూచేటప్పటికి రూపాయి! నేను 'ఎక్కడిది,ని' ఆశ్చర్యంగా అడిగాను. పాలధరుడన్నాడు—"అమ్మ గూట్లో పెట్టింది. మంచం వేసుకొని ఎక్కి తీశాను."

ఇంట్లో అల్మారుగాని, పెట్టెగాని ఏమి లేదు. ఏమున్నా డబ్బుంటే ఒక ఎత్తయిన గూట్లో పెడుతూండేవారు. ఒకసారి మా బాబయ్య ఏదో అమ్మి ఆ డబ్బు తర్వాత జమీందారు కివ్వటంకోసం అక్కడ పెట్టాడు. ఈ సంగతి పాలధరుడి కెలా తెలిసిందో తెలియదు. ఇంట్లో ఎవరి పనుల్లో వాళ్ళుండగా మెల్లిగా ఒకరూపాయి తీసుకొచ్చాడు.

మే మింతవరకు రూపాయిని ముట్టుకో నయినా లేదు. రూపాయిని చూడగానే ఆనందం, భయంతో గూడి మనసులో లేచిన తరంగాలు యింకా జ్ఞాపకం వున్నాయి. మాకు రూపాయంటే ఒక అలభ్యవస్తువు. మాష్టారుకి మావలన పన్నెండణాలు నెల నెలా ముడుతూండేది. నెలాఖరుని బాబయ్య స్వయంగా వచ్చి డబ్బిచ్చి వెడుతూండేవాడు. మేమంటే యింతమాత్రం నమ్మకం కూడ లేదన్నమాట. అటువంటి మాకు ఈ వేళ ఒక రూపాయిమీద ఆధిపత్యం లభించింది. కాని దెబ్బలు తగులుతాయేమోనని భయం మధ్యమధ్య మా ఆనందాలో విఘ్నం కలిగిస్తూంది. బాబయ్య కోపాన్ని నేను కాకపోయినా, పాలధరుడు స్వయంగా అనుభవించాడు అనేకసార్లు. అసలు బాబయ్యంత నెమ్మదస్తుడు ప్రపంచంలో ఎక్కడా ఉండడు. ఆయన రక్షణభారమంతా పిన్నిగనక వహించకపోతే ఈ పాటికి ఎవరో ఒకరు ఆయన్ని బజార్లో అమ్మేసివుందురు. కాని కోపం వస్తేమాత్రం వళ్లు తెలియదు. పైవాళ్ళమీ దెలావున్నా పిన్నిమాత్రం ఆయన కోపానికి ఎంతో భయపడేది. మే మిద్దరం ఈ విషయాల మీద చాలా సేపటివరకు ఆలోచించుకున్నాం. ఆఖరుకి, వచ్చిన లక్ష్మిని కాలదన్నుకోకూడదనుకున్నారం. ఒకటే, మామీదవరికి అనుమానం కలుగనే కలుగదు ఒకవేళ కలిగినా మేం ఏమాత్రం జంకకుండా నిర్భయంగా చెప్పేస్తాం—"మేము తియ్యలేదు. రూపాయితీసి మేమేం చేస్తాం? కావలిస్తే మా దగ్గరంతా వెతుక్కోండి." అని. బహుశా యింకా స్థిమితంగా ఆలోచిస్తే ఆ నిశ్చయం మారిపోవటం, తరువాత జరిగిన ఆ బీభత్సలీల జరక్కపోవటం, జరిగివుండేది. కాని అప్పుడు శాంతంగా ఆలోచించేటటువంటి శక్తిఏమాత్రం మాలో లేదు.

మేం ముఖం కడుక్కొని యింటికొచ్చాము. భయపడుతూ మెల్లిగా లోపల అడుగుపెట్టాం. ఒకవేళ యింట్లో వెతుక్కునే పరిస్థితి కనపడితే, భగవంతుడిదే భారం. కాని ఎవరి గొడవలో వాళ్లున్నారు. ఎవరూ మాతో మాట్లాడలేదు. మేం చద్దన్నమూ తినలేదు. మధ్యాహ్న భోజనమూ తీసుకోలేదు. పుస్తకాలు చంకనిపెట్టుకొని మెల్లిగా స్కూల్‌కి దారితీశాం.

అది వర్షాకాలం. ఆకాశం అంతా మబ్బుగా వుంది. మేం చాలా సరదాగా స్కూల్‌కి పోతున్నాం. యిప్పుడు కౌన్సిల్‌కి మినిష్టరయినాకూడ అంత ఆనందం కలుగదేమో బహుశా. ఎన్నెన్నో కోరికలు మనసులో. ఎన్నో గాలిమేడలు కట్టేసుకుంటున్నాం. మా అదృష్టంకొద్దీ మాకీ అవకాశం లభించింది. అందుచేత ఆ రూపాయిని సాధ్యమైనంతవరకు చాలారోజులు సరిపోయేలా ఖర్చుపెట్టా లనుకున్నాం. ఆ రోజుల్లో శేరు రూపాయికి మంచి మిఠాయి అమ్మేవారు. ఒక అర్థసేరు మాకు సమృద్ధిగా సరిపోతుంది. కాని ఆ రూపాయంతా ఈ వేళే హరించిపోతుంది. చవకగా వచ్చేది, కడుపునిండేది, ఇలాటి వస్తువేదయినా కొనాలి. ఆఖరుకి జామపళ్లు కొనుక్కుందామని నిశ్చయించుకున్నాం. రెండుకాన్ల జామపళ్ళు కొన్నాం. చవక రోజులు. పెద్దపెద్దవి పన్నెండొచ్చాయి. పాలధరుడు పండ్లమ్మి చేతిలో రూపాయి పెట్టాడు. అది సందేహంగా చూస్తూ అడిగింది—"రూపా యెక్కడిది నాయనా? ఎక్కడయినా ఎత్తుకురాలేదుకదా?" మాకేం చాతకాదా? జవాబు మా దగ్గర తయారుగానే వుంది. ఎక్కువకాక పోయినా రెండుమూడు పుస్తకాలు చదివి పూర్తిచేశాం. విద్యాజ్ఞానం కాస్త కాస్త

# ★ ప్రేమ్‌చంద్ బాల్యం ★

ఒంటబట్టింది. నేను వెంటనే అన్నాను—"మాష్టారుకి జీతంయివ్వాలి, ఇంట్లో చిల్లర లేదు. అందుకని మా బాబయ్య రూపా యిచ్చాడు."

ఈ జవాబుతో దాని సందేహం పూర్తిగా వదలిపోయింది. మేమిద్దరం ఒంటెనమీద కూర్చునికడుపునిండా జామపళ్ళు తిన్నాం. యిప్పుడా పదిహేనణాలన్నరని ఎక్కడికి తీసుకుపోవటం? ఒకరూపాయిని దాచటం అంతకష్టం కాదు. కాని చిల్లర డబ్బులు దాస్తే మాత్రం ఎక్కడ దాగుతాయి. మొలలో పెట్టటానికి చోటులేదు. జేబులో పెట్టటానికి వీలులేదు వాటిని జేబులో పెటుకోటం మా దొంగతనాన్ని మేమే చాటుకోవటమన్నమాట మాష్టారు కిచ్చే పన్నెండణాలు యిచ్చేసి, మిగిలిన మూడ ణాలన్నరతో మిఠాయి కొనేసుకుందామని నిశ్చయించుకున్నాం. ఇలా తేల్చుకొని స్కూల్‌కి చేరాం. చాలారోజుల తర్వాత ఈవేళ మళ్ళీ స్కూల్లో అడుగుపెట్టాం. మమ్మల్ని చూడగానే మాష్టారు గర్జించారు— "ఇన్నిరోజులనుంచి ఏమయ్యారా?" నేను చెప్పాను— "మా బంధువులు ఒకరు పోయారండి."

ఇలా చెపుతూనే పన్నెండణాలు మాష్టారు చేతిలో పెట్టాను. డబ్బులు చూడగానే మాష్టారిముఖం వికసించింది. సాధారణంగా నెలదాటిపోయాక ఎన్నోసార్లు అడిగినతర్వాతగాని ఆయన చేతిలో ఎవరిదగ్గర నుంచి డబ్బుపడేదికాదు. అలాంటిది నెల పూర్తవటానికి యింకా చాలారోజులు గడువుండగానే యింతముందరగా డబ్బివ్వటం చూచి ఆయన సంతోషపట్టం ఏమీ అస్వాభావికం కాదు." "మీ రందరూ అడిగినప్పటికీ జీతంయివ్వరు. మేంచూడండి అడ్వాన్సుకూడా యిస్తున్నాం"అన్నట్టుగా మిగతా పిల్లలవైపు సగర్వంగా చూచాం.

మే మింకా పాఠం మొదలుపెట్టామో లేదో, ఈవేళ చెఱువుదగ్గర తీర్థం అనీ, మధ్యాహ్నం స్కూల్‌కి శెలవనీ తెలిసింది. మా మాష్టారు తీర్థంలో బుల్‌బుల్ పక్షుల చేత పందెం వేయిస్తారు. శెలవుసంగతి వినేప్పటటికి మా సంతోషానికి మేరలేక పోయింది. పన్నెండణాలు బ్యాంకులో కట్టేశాం. తీర్థానికి వెళ్ళటానికి మూడణాల న్నర మిగిలింది. చాలా సరదాగా వుంటుంది. మంచి మిఠాయిలు తింటాం, రంగులరాట్నం ఎక్కుతాం. సాయంత్రానికి యింటికి చేరుకుంటాం. కాని మాష్టారు కఠినమైన షరతొకటి పెట్టారు—తీర్థానికి పోయేముందు అందరూ పాఠం అప్పచెప్పి మరీ పోవాలి అప్పచెప్పనివాళ్ళు పోటానికి వీల్లేదు. ఆఖరికి ఫలితం ఏమిటంటే నాకు శెలవు దొరికింది కాని, హలధరుడు మాత్రం ఖైదయిపోయాడు. చాలా మంది కుర్రవాళ్లు పాఠం అప్పచెప్పి తీర్థం చూడటానికి వెళ్ళిపోయారు. నేను కూడ వాళ్ళతో పోయాను. డబ్బులు నా దగ్గరే వున్నాయి. అంచేత నేను హలధరుణ్ని విడిపించే ఏర్పాటేమి చేయలేదు. వాడిని విడిచిపెట్టగానే వాడు నాదగ్గరకి రావటానికి, ఇద్దరం కలసి తీర్థం చూడటానికి నిశ్చయమైంది. వాడు వచ్చేవఱకు నేను ఒక కానీ కూడ ఖర్చు చెయ్యనని పట్టు పెట్టాను. కాని మా అదృష్టం యింకో విధంగా జరుగుతుందని ఏం తెలుసు? నేను తీర్థానికి వెళ్ళి ఒక అరగంటకు పైగా గడచి పోయింది. కాని, హలధరుడి జాడమాత్రం ఎక్కడా లేదు. మాష్టారింకా విడచిపెట్ట లేదా, లేకపోతే త్రోవ మరచిపోయాడా? కళ్లు చిల్లులుపడేటట్టు రోడ్డువైపు చూస్తూనే వున్నాను. ఒక్కడికి తీర్థంలో ఏమీ సరదా లేదు. ఒకవేళ మా దొంగతనం సంగతి తెలిసిపోలేదు కదా! తెలిసి బాబయ్యవచ్చి హలధరుణ్ని తీసుకుపోలేదు కదా! అని సందేహం కలగటం మొదలుపెట్టింది. ఆఖరికి సాయంత్రమైన తర్వాత నేను కొంత మిఠాయి కొనుక్కుని, హలధరుడివంతు డబ్బులు జేబులో వేసుకుని యింటికి బయలుదేరాను. త్రోవలో ఒకసారి 'స్కూల్ వైపునుంచి పోదాం హలధరుడక్కడే వున్నాడేమో' అని తోచింది. కాని అక్కడంతా నిశ్శబ్దంగావుంది. ఒక కుర్రవాడు మాత్రం ఆడుతూ కనుపించాడు. వాడన్నాడు - "ఏం, ఇంటికి వెళ్లి ఎలా దెబ్బలు తగులుతాయో చూద్దుగాని, మీ బాబయ్య వచ్చాడు. హలధరుణ్ని కొట్టుకుంటూ యింటికి తీసుకుపోయాడు. ఎలా కొట్టేడనుకున్నావ్, హలధరుడు పాపం క్రిందపడిపోయాడు. అలా ఈడ్చుకుంటూనే తీసుకుపోయాడు. నువ్వు మాష్టారుకి జీతం యిచ్చావా, అది కూడా తీసుకుపోయాడు. ఇప్పట్నుంచీ ఏదేనా ఉపాయం ఆలోచించుకోలేకపోతే దెబ్బలు బాగా తగులుతాయి."

అది వినేటప్పటికి నాకు తెలివి తప్పినంతపని అయింది. నెత్తురుచుక్క లేకుండా పోయింది. నేను అనుమానించినట్టే జరిగింది. కాళ్ళు మణుగు బరువుగా వున్నట్లు అయ్యాయి. యింటివైపుకొక్క అడుగు వేయటం కష్టం అయిపోతోంది. గుర్తున్న దేవుళ్ళందరికి మ్రొక్కుకున్నా. గ్రామదేవతని స్మరించాను. (మా ప్రాంతంలో గ్రామదేవతనే ఎక్కువగా కొలుస్తారు.) ఇదంతా చేశాను కాని యిల్లు దగ్గరవుతూన్నకొద్దీ నా గుండెదడ హెచ్చసాగింది. మేఘాలు క్రమ్ముకుంటున్నాయి. పెద్ద వాన వచ్చేటట్టుగావుంది. అందరు ఎవరి పనులు వాళ్లు వదలిపెట్టి యిళ్ళకు పోతున్నారు. పశువులు తోకలెత్తి ఎగురుతూ, గంతులేస్తూ ఇళ్ళవైపు పరుగెత్తుతున్నాయి. పక్షులు తమ గూళ్ళకు చేరుకుంటున్నాయి. నేనుమాత్రం అలా మందగతిగానే నడుస్తున్నాను. ఏ జ్వరమైనా, లేక ఏ దెబ్బయినా తగులుతే బాగుండుననిపిస్తోంది. కోరుకుంటే చావేరాదు. ఇక జబ్బు మాట చెప్పేదేమిటి! అదేమి జరుగలేదు. ఎంత మెల్లిగా నడిచినప్పటికి యిల్లు ఎదుటికి రానేవచ్చింది. ఇప్పుడేమిటి చేయటం? మా ఇంటిముందొక పెద్ద చింతచెట్టుంది. బాగా చీకటి పడేవఱకు చెట్టుచాటుని దాక్కుని వుండి, రహస్యంగా ఇంట్లోదూరి, అమ్మ గదిలో మంచంక్రింద కూర్చుని, రాత్రి అందరు నిద్రపోయిన తర్వాత, అమ్మతో జరిగిన సంగతంతా చెప్పచ్చు. కొస్త కల్లబొల్లి ఏడ్పులు ఏడిస్తే సరి, అమ్మ మెత్తబడి పోతుంది.

రాత్రి గడుస్తే, తర్వాత ఎవడు అడగొచ్చాడు. ప్రొద్దుటికి అందరికోపం చల్లారిపోతుంది. నా ఊహాలన్నీ నే ననుకున్నట్టు జరిగితే, ఏ ఆపదా లేకుండా గట్టెక్కుతాను. కాని భగవంతు డింకొకటి చేయదలచుకున్నాడు. నన్ను ఒక కుర్రవాడు చూచి నా పేరుపెట్టి అరుస్తూ చిన్నగా యింట్లోకి పరుగెత్తాడు. ఇక నాకేమీ ఆశ మిగలలేదు. విధిలేక యింట్లో అడుగుపెట్టాను. అడుగుపెట్టగానే దబ్బతిన్న కుక్కలా ఒక్క అరపు అరిచాను. నాన్నగారి ఆరోగ్యం ఆ రోజుల్లో కాస్త

# ★ ప్రేమ్‌చంద్ బాల్యం ★

…పడింది. శెలవు తీసుకుని యింటికి వచ్చి వున్నారు. ఆయనకున్న జబ్బేమిటో నాకు తెలియదు కాని, వేరుశెనగపప్పు తినేవారు, ఔన్సుగ్లాస్‌లో సీసాలోంచి పోసుకుని ఏదో త్రాగుతూండేవారు. బహుశా అది గొప్ప డాక్టరెవడో చెప్పిన మందై వుండచ్చు. మందులన్నీ వెగటుగానూ చేదుగానూవుంటాయి. ఈ మందుకూడ చెడ్డదే, కాని నాన్నగారుమాత్రం ఎందుచేతనో ఎంతోయిష్టంగా త్రాగేవారు మనం మందు త్రాగితే, కళ్ళుమూసుకుని ఒక్క గుటకలో మింగేస్తాం. కాని బహుశా ఆ మందు మెల్లిగా త్రాగితేనేపని చేసేదయివుండవచ్చు. నాన్నగారిదగ్గిర ఆ వూళ్లోని యిద్దరు, ముగ్గురు, యింకొ అప్పుడప్పుడు నలుగు రైదుగురు రోగులు కూర్చునుండేవారు. వాళ్లుకూడ ఎంతో యిష్టంగా గంటలతరబడి ఆ మందు త్రాగుతూండేవారు. భోజనానికిమాత్రం లేచేవారు. నేను వెళ్లేటప్పటికికూడ మందు త్రాగుతున్నారు. నన్ను చూడగానే నాన్నగారు కళ్ళెర్రజేసి అడిగారు—"ఎక్కడున్నావురా, యింత వఱకు?" నేను మెల్లిగా అన్నాను—"ఎక్కడాలేను" "ఇక దొంగతనంకూడా నేర్చుకుంటున్నావన్నమాట, రూపాయి నువ్వుతీశావాలేదా, చెప్పు?"

నోరు పెగల్లేదు. ఎదుట పదునైన కత్తి ఆడుతూన్నట్లనిపిస్తోంది. మాట్లాడటానికికూడా భయం వేసోంది. నాన్నగారు గట్టిగా బెదిరించి అడిగారు—"మాట్లాడ వేమిరా? నిజంచెప్పు నువ్వు తీశావా లేదా?" నేను ఇక ప్రాణాలకి తెగించి అన్నాను—"నేను అన్నానూ......"ఇంకా వాక్యం పూర్తికాకుండానే నాన్నగారు వికరాళ రూపం ధరించారు. పళ్లు కొరుకుతూ ఒక్కసారిగా లేచి నామీద చెయ్యెత్తేరు. నేను గట్టిగా ఏడ్చాను. ఎంతగట్టిగాఏడ్చానంటే, నాన్నగారుకూడ హడలిపోయారు. ఆయన యెత్తిచెయ్యి ఎత్తినటుగానే వుండిపోయింది. కొట్టకుండానే యిలావున్నాడు, కొడితే యిక ప్రాణమే పోతుందనుకున్నారేమో బహుశా. నేను నా యుక్తి పారటం చూచి యింకా గొంతుకచించుకుని ఏడవటం మొదలుపెట్టాను. ఈలోగా నాన్నగారి దగ్గరున్న పెద్దలు నాన్నగారిని ఆపుచేసి నన్నక్కడనుంచి వెళ్ళిపొమ్మని సౌంజ్ఞ చేశారు పిల్లలు సాధారణంగా యిటువంటి సమయంలో యింకా కంగారెత్తిపోయి అనవసరంగా దెబ్బలుతింటారు. కాని నేను మాత్రం చాలా తెలివిగా తప్పించుకున్నాను.

కాని లోపలిదృశ్యం యింకా భయంకరంగావుంది. నా రక్తం చల్లబడిపోయినంత పనయింది. హాలధరుడి రెండు చేతులూ ఒక స్తంభానికి వెనికకట్టేశారు. ఒళ్లు అంతా దుమ్ముకొట్టుకుంది. యింకా ఏడుస్తూనే వున్నాడు.

పిన్ని హాలధరుణ్ని కేకలేస్తోంది. అమ్మ పిండివిసరుతోంది అందరికంటె ముందర నన్ను పిన్ని చూచింది. మూడంగానే అన్నది—"అడుగో వాడుకూడావచ్చాడు ఏమిరా? రూపాయి నువ్వుతీశావా, వీడా?" నేనేమాత్రం జంకులేకుండా చెప్పేశాను— "హాలధరుడే." అమ్మఅన్నది— "వాడేతీస్తే యింటికొచ్చి ఎవరితో నేనా నువ్వెందుకు చెప్పలేదు?"

ఇంకెప్పుడు అబద్ధం ఆడకుండా తప్పించుకోటం కష్టం. నా వుద్దేశ్యం ప్రాణభయం వచ్చినప్పుడు అబద్ధమాడితే పర్వాలేదని. హాలధరుడికి దెబ్బలుతినటం అలవాటే. యింకో రెండుమూడు దెబ్బలుతిన్నా వాడికి పోయిందేమిలేదు. నేనెప్పుడూ దెబ్బలు తినలేదు. నేను రెండుమూడు తిన్నానంటే చాలు నా పని అయిపోతుంది. అయినా హాలధరుడు తను తప్పించుకుని, నన్ను పట్టించాలనుకుంటాడు, లేకపోతే పిన్ని ఎందుకడుగుతుంది— 'నువ్వు తీశావా, వీడా' అని. ఏ సిద్ధాంతరీత్యా చూచినా సరే, యిప్పుడు నేను అబద్ధమాడటం స్తుతించతగ్గది కాకపోయినా, కనీసం క్షమించతగ్గది మాత్రం తప్పకుండా అవును.

నేను వెంటనే అన్నాను—"హాలధరుడు ఎవరితోనయినా చెప్పావంటే చంపేస్తానన్నాడు."

అమ్మఅన్నది—"చూశావా, నేను చెప్పినట్టే అయింది. నేనంటూనే వున్నాను మా వాడికలాంటి అలవాటులేదు డబ్బువాడెప్పుడూ చేత్తో ముట్టుకోనయినా ముట్టుకోడని. కాని అందరూ నన్నే అనటం మొదలుపెట్టారు"

హాలధరుడు— "నే నెప్పుడన్నానూ, ఎవరితోనైనా చెప్పావంటే చంపేస్తానని." నేను—"అక్కడే, ఆ చెఱువుదగ్గిర." హాలధరుడు—"అమ్మ, అంతా అబద్ధమే." పిన్ని. "అబద్ధంకాదు, నిజమే, అబద్ధాలాడేవాడివి నువ్వు. ప్రపంచమంతా నిజం. నీ పేరుబయటికొచ్చింది గా. మీ నాన్నకూడా ఏదైనా నౌకరీచేస్తూ, నాలుగురాళ్లు సంపాదిస్తూవుంటే, నలుగుర్లోనూ పెద్దమనిషనిపించుకుంటూంటే, నువ్వు బుద్ధిమంతుడి వనిపించుకునేవాడివి. యిప్పుడు మాత్రం నువ్వే అబద్ధాలకోరువి. మిఠాయిలూ అవీ తినే అదృష్టం ఎవరికుందో వాడు చక్కగా తిన్నాడు. నీకుమాత్రం తన్నులే రాసిపెట్టాడు దేవుడు."

ఇలా అని పిన్ని హాలధరుడి కట్లు విప్పేసి లోపలికి తీసుకుపోయింది. నా పక్షం మాట్లాడి అమ్మ పరిస్థితి మార్చేసింది కాని, లేకపోతే యింకా పాపం వాడికెన్ని దెబ్బలు తగులునో, నేను అమ్మదగ్గిర కూర్చుని నా నిర్దోషిత్వం యింకా బాగా రుజువుపరుచుకున్నాను. నా సరళహృదయురాలైన తల్లి నన్ను పూర్తిగా సత్యావతారమనుకుంది. తప్పంతా హాలధరుడిదే అని ఆమెకు పూర్తిగా నమ్మకం కలిగింది. ఒక క్షణం పోయాక బెల్లం, వేపుడు బియ్యం తింటూ బయటికొచ్చాను. హాలధరుడు కూడా అటుకులు, బెల్లం తింటూ బయటికొచ్చాడు. నా కథ సుఖమయం, హాలధరుడిది దుఃఖమయం. కాని సమాప్తం మాత్రం ఇద్దరిదీ ఒకటే—బెల్లం, అటుకులు. ★

# మేలు చేసిన మఱ్ఱి

“నీకెంత డబ్బుంటే మాత్రం, ఎంతమంది నౌకర్లుంటే మాత్రం, ఎన్ని మేడలుంటే మాత్రం నోటికి వచ్చినట్లు తిట్టడానికి నీ కధికారం ఎవరిచ్చారు? ఎప్పుడో డబ్బిచ్చానని యిప్పుడు మొత్తుకుంటే లాభమేముంది అప్పుడే అడగక పోయావా? మొహాన్న పారేస్తును.” అని గంగన్న వెంకన్నను బుకాయిస్తున్నాడు. వెంకన్న కొంచెం మెత్తని మనిషి: మాట్లాడలేక పోతున్నా మెల్లమెల్లగా ఘాటైన మాటలే ఒదుల్తున్నాడు. ఆ మాటలు వింటూంటే గంగన్నకు అరికాలి మంట నెత్తికెక్కుతూంది. ఇద్దరూ ఘర్షణ పడుతూండడం చూచి ఆవీధిలోని నలుగురు పెద్దలు వచ్చి విడిపించి అసలు సంగతేమిటని అడిగారు. వెంకన్న యిలా అన్నాడు.

“రెండు సంవత్సరాల క్రితం, మన ఊరులో పాలిపేట కాలిపోయిన సంగతిమీకు తెలుసు అప్పుడు లబో లబోమంటే, యీ గంగన్నకు రెండొందల రూపాయలు యిచ్చాను - కొంప కట్టుకుంటానంటే. అవి అడిగితే అదిగో యిదిగో అని జరిపాడేకాని యిప్పటివరకూ యివ్వలేదు. ఇప్పుడు కొంచెం ఘాటుగా అడిగితే అసలుడబ్బు యివ్వనే లేదంటున్నాడు. పైపెచ్చు నోటికివచ్చిన మాటలు కూస్తున్నాడు.”

“ఏం, గంగన్నా! వెంకన్నగారు చెప్పింది నిజమేనా?” అని ఓపెద్ద మనిషి అడిగాడు “అదేంటండీ! మీరూ అలాగే అంటారు. వెంకన్నగారి దగ్గర డబ్బు బదులు పుచ్చుకోటానికి నేనేం కొండ్రలేని వాడననుకుంటున్నారా. ఐదు కుంచాల మాన్యం ఉంది. అది అమ్మి అప్పుడు ఇల్లు కట్టాను.”

గుజ్జం వెంకట్రాజు

‘అయితే వెంకన్నగారు ఊరికే నీమీద నింద వేస్తున్నారా’ అని అందుకున్నాడో పెద్దమనిషి.

‘ఏమో లెండి. ఆయన కాస్త ఉన్నవాడు-ఎలా చేసినా చెల్లుతుంది’ అని ఏమేమో వాగుతుండగా మునసబుగారు రావడంచూచి అందరూ లేచారు. గంగన్నకు మునసబుగార్ని చూడ్డం తడవుగా గుండె నీరైపోయింది. మునసబుగారు ఎంత దయగలవారో అంత కఠినులు. ఎవరైనా తప్పుచేసి లేదన్నారా - వాడిచర్మాలు లాగేవారు. లేదా తప్పు ఒప్పుకున్నాడా వాడికి నష్టం లేకుండా, స్వల్పనష్టాలు యీయనే భరించేవాడు. తెలివైన వాడు, గౌరవనీయుడు. అందుచేత గంగన్న ఏం జరుగుతుందో అని భయపడుతున్నాడు.

మునసబుగారు చుట్ట ముట్టించి వీధి అరుగుమీద కూర్చున్నారు. వంపుతిరిగిన పేముబెత్తం ప్రక్కనే ఉంది. క్రింది అరుగుమీద పెద్దమనుష్యులు కూర్చున్నారు, ఊరి కరణం, మిగతా నౌకర్లు అరుగు ప్రక్కనే నిలబడ్డారు. మునసబుగారికి జరిగినదంతా విన్నవించాడు వెంకన్న. ఈవార్త ఎప్పుడు ప్రాకిందో ఊళ్లో జనమంతా అక్కడికి ఒచ్చేశారు. ఎవ్వరూ కిక్కురుమనటం లేదు.

‘వెంకన్నగారూ! మీరు గంగన్నకు యిచ్చిన సొమ్ముకు నోటుగాని, సాక్ష్యముగాని ఏమీ లేదు గదూ?’ అన్నారు మునసబుగారు.

‘అవునండీ, ఆవేళ నేను కాకినాడనుండి వస్తుంటే మధ్యత్రోవలో కలుసుకొని ఎలా అయినాసరే రెండువందలుసాయంచేస్తే, కొంపనిలబడుతుంది. లేకపోతే ప్రాణాలు నిలువునా పోతాయి’ అని కాళ్ళావేళ్ళా పడ్డాడండి దాంతో నేను జాలిపడి మఱ్ఱిచెట్టుక్రింద నిలబడి రెండు వందలు యిచ్చానండి. నమ్మకంగల వ్యక్తి గనుక నోటు వ్రాయించుకో లేదు. ఇప్పటికిది జరిగి రెండు సంవత్సరాలైంది.’

‘ఏం గంగన్నా! వెంకన్నగారు చెప్పిందానిలో ఏమైనా తప్పుంటే చెప్పకుంటావా?’

“అంతా తప్పేనండీ బాబయ్యా! యీ రోజుల్లో నోటూ, పాటూ

# ★ మేలుచేసిన మఱ్ఱి ★

లేకుండా ఎవరిత్తారు బాబయ్యా డబ్బు?"

ఏం తీర్పు చెప్తారో అని అందరూ గ్రుడ్లు మిటకరించి చూస్తున్నారు. మునసబుగారు మరో చుట్ట వెలిగించారు. అంతా నిశ్శబ్దంగా చూస్తున్నారు. 'అయితే వెంకన్నగారూ! మీకు ఆ మఱ్ఱిచెట్టు తప్ప ఇంకో సాక్ష్యం ఏమీ లేదన్నమాట. సరే బావుంది. మీరు వెళ్లి ఆ మఱ్ఱిచెట్టును ఇక్కడకు తీసుకురాగలరా' అన్నారు. అందరూ నిశ్చేష్టులయ్యారు. మునసబుగారికేమైనా పిచ్చి యెత్తిందా అనుకున్నారు.

'చెట్టు ఎలా వస్తుందండీ యిక్కడకి' అన్నాడు వెంకన్న?

'నేను రమ్మన్నానని చెప్పు' అన్నారు మునసబుగారు.

ఇహ చేసేది లేక, మునసబుగారిని కాదనలేక, వెంకన్న మఱ్ఱిచెట్టు దగ్గరకు వెళ్ళాడు. అందరకీ అయోమయంగా ఉంది.

వెంకన్నగారు వెళ్ళిన అరగంటకు మునసబుగారు గంగన్నను ప్రశ్నించారు 'గంగన్నా! ఈ పాటికి వెంకన్న మఱ్ఱిచెట్టు దగ్గరకు వెళ్ళగలడంటావా?'

'ఇంకా వెళ్ళలేరండి, అది యిక్కడకు సుమారు రెండుమైళ్ళుంటుంది. పైగా చెఱువుగట్టున దారి వర్షం మూలన బావుండదు.' అన్నాడు గంగన్న.

ఇది అందరూ విన్నారు. గంగన్న మాటలు, మునసబుగారి ప్రవర్తన, వెంకన్నగారు చేస్తున్న పని చూస్తూవుంటే ప్రజలందరకీ బుర్రలు చెడిపోతున్నాయి.

సరే! ఉదయం గం 10 లకు వెళ్ళిన వెంకన్న, మధ్యాహ్నం గం 12 లకల్లా వచ్చేశాడు. 'చెట్టు మాట్లాడలే'దని చెప్పాడు వెంకన్న మునసబుగారితో.

'అక్కర్లేదోయి! చెట్టు యిక్కడకు రాకుండానే అంతా నాకు తెలిసిపోయింది. గంగన్న డబ్బు పుచ్చుకున్న మాట నిజమే. అది నీకు గంగన్న యిస్తానని కూడా ఒప్పుకుంటున్నాడు' అని అనడంతోనే జనమంతా చెవులకు బాగా పని చెప్పి వినడం మొదలెట్టారు. గంగన్న వణుకుతున్నాడు.

మునసబు మరో చుట్ట వెలిగించాడు. బెత్తం పట్టుకొని లేచాడు. అందరితో యిలా అన్నాడు 'వెంకన్నను నేను చెట్టుదగ్గరకు ఎందుకు వెళ్ళమన్నానో మీకు యీ పాటికి తెలిసేఉంటుంది. చెట్టేమిటి యిక్కడకు సాక్ష్యం యివ్వడానికి రావడం ఏమిటి? ఇది జరుగుతుందని నేను వెంకన్నను పంపలేదు. గంగన్న నిజాయితీ తెలుసుకోవాలని యిలా చేశాను. చూడండి. మీరందరూ వింటూండగానే, వెంకన్న చెట్టుదగ్గరకు వెళ్ళిన తరువాత గంగన్నను నేను అడిగాను 'వెంకన్న చెట్టుదగ్గరకు వెళ్ళగలడా అని'. దానికి గంగన్న చెప్పిన జవాబు మీరు విన్నారు. 'లేదండి అది యిక్కడికి సుమారు రెండుమైళ్ళుంటుంది. పైగా చెఱువుగట్టున ఉంది. వర్షం కూడా,' అని చెప్పాడు గదా, గంగన్న! గంగన్నేగాని వెంకన్నగారు కాకినాడ నుంచి తిరిగి వచ్చేటప్పుడు ఆ మఱ్ఱిచెట్టు క్రింద రెండు వందలూ అప్పు పుచ్చుకోని వుండకపోతే, ఆ మఱ్ఱిచెట్టు ఇక్కడకు ఎంత దూరముందో గంగన్నకెలా తెలిసింది? నిజంగా ఆ మఱ్ఱిచెట్టు క్రింద రెండువందలు పుచ్చుకోబట్టే ప్రశ్న వేయగానే ఆ చెట్టు జ్ఞప్తికి వచ్చి, వెంటనే దాని దూరం, ఉనికి చెప్పగలిగాడు. దీనిని బట్టి గంగన్న నూటికి నూరుపాళ్ళు రెండు వందలు వెంకన్నగారికి యివ్వవలసిందే!' అని గంగన్నవైపు తీక్షణంగా చూచి, చేతి బెత్తంతో ఛటాలున వీపున కొట్టాడు. దెబ్బతో గంగన్న చేసిన తప్పు ఒప్పుకొని మునసబుగారి కాళ్ళపైబడ్డాడు. మునసుబుగార్ని బ్రతిమలాడుకున్నాడు.

మునసబుగారు దయతలచి గంగన్న తరఫున రెండు వందలూ వెంకన్నగారికిచ్చారు. ఇంకెప్పుడూ నోటులేందే డబ్బు ఎవ్వరికీ యివ్వవద్దని వెంకన్నగారికి వార్నింగు యిచ్చారు. రెండువందలూ తీరేవరకు తన పాలేరుగా ఉండమని గంగన్నకు చెప్పారు. మఱ్ఱిచెట్టు చేసిన మేలుకు వెంకన్నగారు దానికి కృతజ్ఞత చెప్పటానికి పసుపు కుంకుమ పట్టుకెళ్ళారు. 'సాక్ష్యమిచ్చిన మఱ్ఱి' చెట్టని యిప్పటికీ దానికి పేరు. జనం ఆ వేళా, యిప్పుడూ తండాప తండోపుగా వెళ్ళి దాన్ని చూస్తూంటారు.



భర్త, ఆలస్యంగా ఇంటికి వస్తూ:— "ఇవ్వాళ ఇంత పొద్దుపోయిన దాకా ఎక్కడున్నానో చెప్పకో!"

భార్య:— "నాకిందాకే తెలిసింది లెండి; మీ కథ మీరు చెప్పండి, అదికూడా వింటాను." ★

"అమ్మా, మనం కొత్తగా కొన్న పూలకుండీ ఎవరైనా బద్దలు గొడితే ఏంచేస్తావ్?"

"వీపు పగలగొడతాను, తెలిసిందా?"

"అయితే, రెడీగావుండు, దాన్నిప్పుడే నాన్న చూసుకోకుండా తన్ని కిందపడేశారు." ★

# ★ జరీఅంచు తెల్లచీర ★

(16-వ పేజీ తరువాయి)

అని ఎలా చెప్పడం ?

సూదిమేకులమీద, ముళ్ళడొంకలమధ్య నిల్చున్నట్టుగా నిల్చొంది.

ఇంతలో, వాడు చీరలమేటిలోంచి పైకి తీసేడు.

జరీ! జరీ! జరీఅంచు తెల్లచీర!

తాచుపాముని చూసినట్టుగా జడుసుకొంది విశాలాక్షి.

దూరంగా, దూరంగా, ఈ విషాన్ని దూరంగా తీసేయండి.

"ఎంతండీ?"

"ఇరవైరెండు"

అతను జంకిజంకి, భయపడిభయపడి,

"కొంచెం...కొంచెం అయినా ... తగ్గదంటారా?" అనేసరికి—

"ఇదేం శుక్రవారం సంతకాదు, బేరాలాడ్డానికి" అనే మాటల్తో కొట్టేడు వాడు.

దెబ్బ తగలగానే కదలడానికి భయపడ్డ నాన్న:

"పోనీ...మరోరకం...కొంచెం తక్కువ ఖరీదువి..." అనేలోపునే వాడు.

"లేవండీ, బాబుగారూ, లేవు" అని అవమానకరమైన అతిమర్యాదాతో అన్నాడు.

షాపంతా అతి నిశ్శబ్దం.

వాడు వెటకారంగా నవ్వనైనా నవ్వలేదు.

కనకారావులు నవ్వకుండానే అవమానించగలరు.

ఈకనకారావులనెత్తురుమాడ్డంఎప్పుడు?! అందులో నా తెల్లచీర తడపడం ఎప్పుడు?!

క్రోధజ్వాలవిశాలాక్షిని దహించేస్తోంది.

షాపుబైట -

దెబ్బతిన్న గొడ్డులా కనిపించే ఈ వృద్ధుడెవ్వరు?

"నేవద్దంటే ఎందుకు విన్నావుకాదు నాయనా!"

"అంత ఖరీదు లుంటా యనుకోలేద"

నెత్తురే ఖరీదుగాఇచ్చినా దొరకని వస్తువులు!!

దహించుకుపోయే విశాలాక్షిని ముంచేయడానికి ఉప్పెన వస్తోంది.

ఒక్క జరీఅంచు తెల్లచీర!

పుక్కి మంచంలో కూలబడి కూర్చొన్న విశాలాక్షి కొట్టుకుపోతూ చూస్తోంది.

ఇంట్లో,

కష్టపడి కష్టపడి వెలిగే "తుపానుదీపం"; ఫిజిక్స్ పుస్తకం చిక్కుల్లో ఇరుక్కున్న అన్నయ్య; పదమూడో ఎక్కం గతికల్లో పడిలేచే తమ్ముడు; నిద్దర పట్టనితల్లి; అగ్గి దొరకనితండ్రి; ఏడవకుండా ఉండని చిన్న తమ్ముడు.

విశాలాక్షికి ఏడుపు వస్తోంది.

అన్నయ్యకి ఫిజిక్స్ పాఠం అర్థంకాదు. తమ్ముడికి పదమూడో ఎక్కం చస్తేరాదు. అమ్మకి నిద్దరపట్టడం అనేదిఉండదు. నాన్న అగ్గికోసం వెతుకుతూనే ఉంటాడు. చిన్న తమ్ముడు ఏడవక తప్పదు.

ఇహ నా వెలగలేనిదీపం ఎంతసేపు వెలగ్గలదు? ఎంతసేపు వెలుగుతుంది?

- నేనేడవను,

అనుకొన్న విశాలాక్షికి మరింక ఆగకుండా ఏడుపువస్తోంది.

పుక్కి మంచంలో కూలబడి కూర్చొన్న ఈ పదహారేళ్ల ఆడపిల్ల ఏకధారగా, వరద వరదగా ఏడుస్తోంది.

ఇది మెరుపులేని మబ్బు. ఇది తెరిపిలేని ముసురు. ఇది ఎంతకీ తగ్గని ఎండ. ఇది ఎప్పటికీ తెల్లవారని చీకటి రాత్రి. ఇది గ్రీష్మం. ఇది శిశిరం. ఇది దగ్ధంచేసే దవానలం. ఇది రెక్కల్ని రాల్చేసే వైరాశ్యం—

ఒక్కటి! ఒక్కటేసుమండీ! ఒక్క జరీఅంచు తెల్లచీర ! ★





మైసూరు మహారాజాగారి పల్లకి

ఫొటో: వి. సత్యనారాయణ రెడ్డి, మైసూరు.



పారమౌంట్ వారి త్రీ-డీ చిత్రం "ట్రాపిక్ జోన్"లో రోండా ఫ్లెమింగ్.

# ★ మన దేశంలో ఫిలిం ఎకాడమీ ఆవశ్యకత ★

—ఎన్నార్

మన దేశంలో తప్ప, చలనచిత్ర పరిశ్రమ బాగా అభివృద్ధి పొందిన ప్రతి దేశంలోనూ సినిమా కళకు, టెక్నిక్‌కు సంబంధించిన ఎకాడమీలు వున్నాయి. నటన, దర్శకత్వం, స్క్రిప్టు రచన, ఫోటోగ్రఫీ, సౌండ్ మొదలైన వివిధ శాఖలలో విద్యార్థులను తర్ఫీదు చేయడంలోనైతేనేమి, ఆయా శాఖల్లో ప్రవీణులైన వారికి బహుమతులివ్వడంలోనైతేనేమి, టెక్నిక్‌లో కొత్తదారులు తొక్కి అభివృద్ధికి పాటుబడే వారిని ప్రోత్సహించడంలోనైతేనేమి ఈ ఎకాడమీలు కృషి చేస్తున్నాయి. వీటిని నిర్వహించేది ఆయా దేశాల్లోని సినిమా పారిశ్రామికులే. తమ తమ ఆదాయాల్లో కొంతభాగం ఈ ఎకాడమీల నిర్వహణకు వారు ఉపయోగిస్తారు. అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సు, ఇటలీ మొదలైన దేశాల్లో ఇటువంటి ఎకాడమీల కృషి మూలంగా సినిమా టెక్నిక్ ఎంతో అభివృద్ధి చెందింది.



అప్సరల్లాంటి రాజపుత్రికల చిత్రాలు చూపిస్తుంటే ఏదీ నచ్చక తన ఊహాసుందరి మీదనే తలపు నిలిపిన చందనరాజు.

విజయావారి "చంద్రహారం"లో ఎన్. టి. రామారావు, రేలంగి, సూర్యకాంతం.

మన దేశంలో చలన చిత్రనిర్మాణం బాగా అభివృద్ధి పొందినదన్న మాట నిజమే గాని, ఈ అభివృద్ధి శాస్త్రీయమైన పద్ధతుల్లో జరగలేదు. అందుచేతే మన చిత్రనిర్మాణాభివృద్ధిలో సర్వతోముఖమైన అరాజకం ప్రబలివున్నది. పెట్టుబడి, ప్రొడక్షన్, టెక్నిక్ మొదలైన అన్ని విషయాలూ ఈ అరాజకానికే గురి అవుతున్నాయి. టెక్నిక్ విషయం చూస్తే ఇక్కడికి దిగుమతి అయ్యే హాలీవుడ్ చిత్రాలలో ఏ రకం కొత్తదనం కనిపించినా మనవారు గుడ్డిగా అనుకరించడం కనిపిస్తోంది. హాలీవుడ్‌లో శాస్త్రీయంగా కనుక్కోబడి, ఒక నిర్దిష్ట ప్రయోజనం కోసం ఉపయోగించబడే ప్రతి టెక్నికల్ 'నావల్టీ'ని మనవారు ప్రయోజన రహితంగా అనుకరించడం ఎక్కువైంది. మనకు నలభయ్యేళ్ళ సినిమా చరిత్ర ఉన్నప్పటికీ సినిమా టెక్నిక్‌కి సంబంధించిన ఒక్క ఎకాడమీ గాని, ఒక్క రిసెర్చి కేంద్రం గాని నాలుగు నాళ్ళపాటు నడిచేది లేకపోవడం శోచనీయం.

ఈ మధ్య సిలోన్ నివాసి మూనాస్ గారు పాతిక లక్షలు పెట్టి ఒక దబ్బు చిత్రం తీశారు. ఇంత ధనం వృథాగా వెచ్చించి ఎందుకూ కొరగాని చిత్రం తీయడంకంటె, దాన్ని సద్వినియోగం చెయ్యడానికి ఆయనకి మరొక మార్గమే దొరకలేదా అని పలువురు సహృదయులు విచారించారు. ఉదాహరణకి ఆ ధనంతో ఆయన మద్రాసులోనే చక్కని ఫిలిం ఎకాడమీ ఏర్పాటు చేసి వుండవచ్చు. అందులో నటీనటులు, ఫోటోగ్రాఫర్లు, డైరెక్టర్లు, సౌండ్ ఇంజనీర్లు కాగోరే వారికి తర్ఫీదు ఇవ్వడం, సినిమా రంగంలో ప్రావీణ్యం కనబరచిన వారిని, రిసెర్చి చేయగోరే వారిని ప్రోత్సహించడం చేస్తే ఎంత బాగుండేది! దీనివల్ల మూనాస్ గారు తనకు ప్రీతిపాత్రమైన సినిమా కళకు ఎంత శాశ్వతమైన, ఆదర్శవంతమైన మహోపకారం చేసి వుండేవారు!

సోవియెట్ డైరెక్టరు ఐజెన్‌స్టీన్ దగ్గర



ప్రసాద్ ఆర్ట్ పిక్చర్సువారి "పెంపుడు కొడుకు"లో
ఎస్. వి. రంగారావు.

# మనదేశంలో ఫిలిం ఎకాడమీ అవశ్యకత

ఫిలిం డైరెక్షను నేర్చుకున్న బ్రిటిష్ డైరెక్టరు హెర్బర్ట్ మార్షల్ మాస్కోలో తన అనుభవాలను గూర్చి ఒక వ్యాసం వ్రాశాడు. (హెర్బర్ట్ మార్షల్ ప్రస్తుతం బొంబాయిలో వుండి ఇంగ్లీషు, హిందీలలో ఒక చారిత్రిక చిత్రం తయారు చేస్తున్నాడు. ఈయన నటుడూ, డైరెక్టరు, కవి, రచయితకూడాను) ఈ వ్యాసాన్ని ఈ దిగువ తర్జుమా చేస్తున్నాను.

"మాస్కోలోని 'హైయర్ స్టేట్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ సినిమా' అనే సంస్థలో నేను మూడేళ్ళపాటు ఐజెన్‌స్టీన్ దగ్గిర విద్యార్థిగా వున్నాను. ఈ సంస్థలో నాలుగు శాఖలున్నాయి: డైరెక్టింగ్, నటన, స్క్రిప్టు రచన, ఫోటోగ్రఫీ. వీటిలో డైరెక్టింగ్ శాఖకు ఐజెన్‌స్టీన్ ప్రధానాచార్యుడు.

ఈ సంస్థకు సొంత స్టూడియో ఉన్నది; అన్ని దేశాలనుండీ సేకరించిన ఉత్తమ చలన చిత్రాల లైబ్రరీ ఉన్నది. నేనక్కడ చదువుకునే రోజుల్లో కోర్సు కాలపరిమితి నాలుగున్నరయేళ్లు వరకూ వుండేది. మూడేళ్ళపాటు విద్యాలయంలోనే థియరీ, ప్రాక్టికల్ రెండూ అభ్యసించాలి. మిగతా ఏడాదిన్నరా స్టూడియోల్లోనూ, లొకేషన్లలోనూ ప్రాక్టికల్ వర్కు నేర్చుకోవాలి. డైరెక్టర్ల కోర్సుకి సుమారు ముప్ఫయి సబ్జక్టులు నేర్పేవారు. వీటిల్లో తత్వశాస్త్రం (ఫిలాసఫీ), ఆర్థిక శాస్త్రం (పొలిటికల్ ఎకొనమీ), సాంఘిక శాస్త్రం (సోషియాలజీ), లలితకళలు, ప్రపంచ చలనచిత్ర, నాటకరంగ చరిత్ర, సినేరియో రచన, ఎడిటింగ్, నటన, మనస్తత్వ శాస్త్రం (సైకాలజీ), నాటక నిర్వహణం రేడియో, ఫిలిం నిర్వహణం, ఫోటోగ్రఫీ, లైటింగ్, మేకప్, సెట్ డిజైనింగ్, స్టూడియో నిర్వహణం మొదలైనవన్నీ ఉండేవి.

మొత్తం విద్యాలయం అంతటిలోకీ ఐజెన్‌స్టీన్ దగ్గిర విద్యాభ్యాసం చేసే అవకాశం లభించిన ప్రతి విద్యార్థి తను చాలా అదృష్టవంతుణ్ణని గర్వపడేవాడు. సినిమా కళను గూర్చిన తన సిద్ధాంతాల్ని, స్వప్నాల్ని ఆచరణలోకి తేగలిగేటట్లుగా తన విద్యార్థుల్ని తర్ఫీదు చెయ్యాలని ఆయన అనుకునేవాడు: "ప్రకృతి పరిణామానికి డార్విన్ సిద్ధాంతాలు ఏ అర్థాన్ని ప్రతిపాదించాయో, సంఘ పరిణామానికి మార్క్స్ సిద్ధాంతాలు ఎటువంటి అర్థాన్నిచ్చాయో, అటువంటి అర్థాన్నే కళకు ఇవ్వగల సిద్ధాంతాన్ని ప్రతిపాదించడమే నా జీవితాశయం. కళాసృష్టి ఎందువల్ల జరుగుతోందీ, అసలు కళాసృష్టి అంటే ఏమిటి, అనే రహస్యాన్ని ఛేదించడానికి ప్రయత్నించడమే నా లక్ష్యం," అని ఐజెన్‌స్టీన్ విద్యార్థులతో చెప్పేవాడు.

క్లాసులో ఐజెన్‌స్టీన్ ఇచ్చే ఉపన్యాసాల్ని, మా ప్రశ్నల్ని, ఆయన సమాధానాల్ని, చర్చనీ వ్రాసుకునేందుకు ఇద్దరు స్టెనోగ్రాఫర్లు ఎప్పుడూ రెడీగా ఉండేవారు.

ఆయన బోధించే పద్ధతి ఎలా వుంటుందో నిజంగా జరిగిన ఒక ఉదాహరణ ద్వారా చెబుతాను. షేక్స్పియరు నాటకం 'జూలియస్ సీజరు'లో మూడో అంకం, మొదటి రంగాన్ని, అంటే సీజరు హత్యచేయబడే దృశ్యాన్ని నాటక రంగంమీద నిర్వహించమని ఆయన మమ్మల్ని ఆదేశించేవాడు.

దీనికోసంగాను మా క్లాసు నాలుగు ముఠాలుగా విభజించబడింది. ప్రతి ముఠాలోని విద్యార్థులూ కూడబలుక్కొని ఆ దృశ్యాన్ని ఎల్లా నిర్వహించాలో, రంగస్థలం ఎలావుండాలో కాగితంమీద వివరంగా వ్రాసుకోవాలి. తరవాత ఒక్కొక్క ముఠా మిగతా ముఠాల ఎదుట ఆ దృశ్యాన్ని నటించి చూపించాలి. ఇదంతా సమగ్రంగా ఉండనక్కర్లేదు; ప్రతివాడూ తనే డైరెక్టయితే ఎలా నిర్వహిస్తాడో చూపించడమే దీని ప్రయోజనం.

మొదట ఆ దృశ్యాన్ని సాంఘిక, రాజకీయ, చారిత్రిక దృక్పథాలతో విమర్శించి వ్యాఖ్యానించేవాళ్లం. తరవాత ఆదృశ్యంలోని సారాంశం, సంఘటనలు, శిల్ప చాతురి, రూపకల్పన, పాత్రలు, సంభాషణలు, మొదలైన అంశాలన్నీ వివరంగా చర్చించేవాళ్లం. దృశ్యంలోకల్లా అతి ముఖ్యమైన సంఘటనలను గుర్తుపెట్టుకునేవాళ్లం. తరవాత ఆదృశ్యాన్ని సీక్వెన్సులుగాను, సీక్వెన్సులను ఉపసంఘటనలుగాను విభజించేవాళ్లం.



సోవియెట్ యూనియన్‌లో ఇందిరా గాంధిగారి పర్యటన

తరవాత ఒక్కొక్క సీక్వెన్సుకూ సెట్టింగ్ ఏవిధంగా వుండాలో నిర్ణయించేవాళ్లం. ఉదాహరణకి 'జూలియస్ సీజరు' లోని యీ దృశ్యం నిర్వహించడంలో ఒక చిక్కు వస్తుంది. కొంతభాగం సెనేట్ మందిరం వెలుపల, కొంతభాగం సెనేట్ మందిరంలోపల జరుగుతుంది. షేక్స్పియర్ రోజుల్లో రంగస్థలంమీద ఈ చిక్కు ఎలా పరిష్కరించేవారు! మేము ఎలా పరిష్కరిస్తే బాగుంటుందని

(50-వ పేజీ చూడుడు)



విశాఖపట్టణంలో వినోదావారి "దేవదాసు" శతదినోత్సవ సందర్భంలో లక్ష్మీటాకీసులో తీసిన ఛాయాచిత్రం : ముందువరుసలో పీకేటి, నాగేశ్వరరావు, సావిత్రి, వేదాంతం రాఘవయ్య, డి. ఎల్. నారాయణ మున్నగువారున్నారు.

# ప్రశ్నలు..సమాధానాలు

సి. హెచ్. వి. వి. ప్రసాదరావు—విజయవాడ.

నేటి చిత్రాలు కేవలం వినోదం కొరకే గాని, విజ్ఞాన విషయకంగా వాటినుండి ఏమీ ఆశించవద్దన్న వాసన్ గారి అభిప్రాయంతో మీ రేకీభవిస్తారా?

—వాసన్‌గారు తమ అభిప్రాయంతో తామే ఏకీభవించనట్లు తోస్తుంది. "అవ్వయ్యార్" చిత్రంలో వినోదానికి అంత ప్రాధాన్యం ఇవ్వకుండా, ధర్మ ప్రచారానికే ప్రాధాన్యం ఇచ్చారు. ప్రజలకు ఉపదేశం చేయగల అర్హత నిర్మాతలకు లేదని వాసన్‌గారిదివరలో అన్నప్పటికీ "అవ్వయ్యార్" ద్వారా ప్రజలకు ధర్మోపదేశం చేయడానికే ఆయన ప్రయత్నించారు.

*  *  *

ఎస్. సి. హెచ్. వీరాచారి—విజయనగరం.

మన దేశము ఎల్లప్పటికీ వ్యవసాయ దేశముగనే యుండవలయునని యుద్దేశపడి బిమల్ రాయ్ "దో-బిఘా-జమీన్" తీసినట్లు తోచుచున్నది. ఈ విషయములో బిమల్ రాయ్‌తో మీ రెంతవరకు ఏకీభవిస్తారు?

—మన దేశం ఎల్లప్పటికీ వ్యావసాయికంగానే ఉండాలని, పరిశ్రమలు అక్కర్లేదనీ ఈ రోజుల్లో ఎవరూ వాదించరు. "దో-బిఘా-జమీన్" చిత్రంనుంచి మీరు చెప్పిన అర్థం తీయడానికి ఆధారం లేక పోలేదు. అయితే ఆ చిత్రంలో ముఖ్య విషయం అది కాదు. దేశం పారిశ్రామికంగా మారుతోందనీ, ఈ మార్పునకు చిన్న రైతులు బలి అవుతున్నారనీ ఆ చిత్రం చూపిస్తోంది. శంభూ పొలంలో జమిందారు ఫ్యాక్టరీ నిర్మించడం దేశంమీద భక్తితో చేసిన పనికాదు; స్వలాభంకోసం చేసిన పనే. తన పొలంలో ఫ్యాక్టరీ కట్టడంవల్ల దేశానికేదో ఉపయోగం కలుగుతుందని భావిస్తే శంభూ తన పొలం అమ్మడానికి అంగీకరించే వాడేమో.



మద్రాసు ఆర్టు ప్రొడక్షన్సువారి "రోహిణి"లో రంగారావు, లంకా సత్యం.

చిన్న రైతులకు జీవనాధారం లేకుండా చేసి ఎవరో కొందరి స్వార్థప్రయోజనాల కోసమే పరిశ్రమలు పెంపొందడం క్షేమం కాదు.

*    *    *

పుణ్యమూర్తుల కొండలరావు,- పెనికేరు.

రాజాజీ సినీమాలు చూడవద్దంటారు. ప్రకాశంగారు 'అవ్వయ్యార్' వంటివి చూడవచ్చంటారు. ఎవరిని అనుసరించ మంటారు.

—"అవ్వయ్యార్" చిత్రంలో రాజాజీ కావాలనే భక్తి వగైరాలు ఉన్నాయి కనుక బహుశా అటువంటి చిత్రాలు చూడ వచ్చనే ఆయన అంటారు.

'ధర్మ సందేహము' అన్న దానిని వివరిస్తారా?

—ధర్మాన్ని గురించి వచ్చిన సందేహాన్ని ధర్మ సందేహం అంటారు.

*    *    *

వి. డి. జయపాలు—బద్వేలు.

వినోదావారి "దేవదాసు"లో దేవదాసు పాడే పాటలో "పడి యోవమయినే గాక పాటులేదోయ్, ఓడిపోలేదోయి" అనే వాక్యమునకు నిజమయిన అర్థమేమిటి?

—సాధారణంగా చాలా సినిమాల్లో పాటలు సంగీతం కోసం వ్రాయబడతాయి కనుక వాటిని సంగీతం కోసమే విని ఆనందించడం మంచిది. అర్థం కోసం వెదకడం మొదలిడితే వెదకదగినంత అర్థం కనిపించదు.

*    *    *

"శాంతశ్రీ"—ఏలూరు.

"చండీరాణి" సినిమాలో చండి అడవిని విడిచి నగరమునకువచ్చి కోటలో ప్రవేశిస్తుంది. అప్పుడు లైటింగ్ చూస్తే పగలు లాగుంది. ఆ తరువాత చంప గదిలోనికి ప్రవేశిస్తుంది. చంపను నిద్రనుండి మేల్కొల్పుతుంది. కొంచెము సేపయిన తరువాత శబ్దము విని దాసీది వస్తుంది. వచ్చి "పీశకల వచ్చిందా? పడుకో" అని వెళ్ళి పోతుంది. అప్పుడు రాత్రిలాగుంది. ఆ సంఘటనలు జరిగినప్పుడు రాత్రా? పగలా?

—మన చిత్రాల్లో సాధారణంగా లైటింగ్ దారి లైటింగ్‌దీ, వేళ (Time) దారి వేళదీ.

పి. బాలకృష్ణారెడ్డి—తేలప్రోలు.

తెలుగుభాషలో ఏ నాటికయినా టెక్నికలర్ చిత్రాలు వస్తాయని ఆశిమోకున్నదా?

—ఏ నాటికో చెప్పలేంగాని, ఏ నాటికో ఒక నాటికి టెక్నికలర్ చిత్రాలేకాదు, త్రీ-డీ చిత్రాలు కూడా తెలుగులో వస్తాయి. రావడానికి ఆధారం ఏముంది?

గొప్ప గొప్ప వాళ్ళంతా విశేషంగా ప్రశంసించారు. కాని శ్రీ ఎన్నార్ "అవ్వయ్యార్" చిత్రాన్ని విమర్శించారు, ఎందువలన?

—కారణాలు ఆవిమర్శలోనే చెప్పారు గదా.

ప్రస్తుతం ఇటలీ, జపాను దేశాల చిత్రాలకు పెద్ద గౌరవము ఇవ్వబడుతున్నది అన్నారు, ఎందువలన?

—ఇటలీ నుంచి వరసగా వాస్తవిక చిత్రాలు వస్తున్నాయి. జపాను నుంచి టెక్నిక్‌లో కొత్తదార్లు తొక్కే చిత్రాలు వరసగా వస్తున్నాయి. ఇదే వాటిపై గౌరవానికి కారణం కావచ్చు.



ఆలంమూర్‌లో "పెంపుడుకొడుకు" ఔట్‌డోర్ షూటింగు కెమెరాలోనుండి చూస్తున్నది డైరెక్టరు ప్రసాద్; ప్రక్కనవున్నది కెమెరామెన్ ఆది ఇరాని వెనక ఉన్నది; ప్రొడక్షన్ మేనేజరు లింగం.



**రోహిణీవారి "ప్రతిజ్ఞ"లో సావిత్రి, సీత, మధు, సారంగపాణి.**

# మన దేశంలో ఫిలిం ఎకాడమీ ఆవశ్యకత

(47 వ పేజీ తరువాయి)

ఈ ప్రశ్నలన్నీ చర్చించేవాళ్లం. రంగస్థలం మీద పాత్రధారులు వివిధంగా సంచరించవలసి వుంటుందో దాన్నిబట్టి సెట్టింగ్‌ను నిర్ణయించేవాళ్లం

ఆతరవాత ఆదృశ్యానికి యథార్థ వాతావరణం ఇవ్వడం గురించి ఆలోచించేవాళ్లం: [illegible], గ్రంథాలు, వివిధస్థలాలు, [illegible] వస్తువులు, మనుష్యులు — ఉదాహరణకు. దీని తరవాత ప్రస్తుత సందర్భంలో పాత్రధారుడు ఎలా ఉండాల్సింది ప్రేక్షకుని దృష్ట్యా నిర్ణయించేవాళ్లం. సంకులమైన ప్రజాసమూహం యొక్క కదలికలూ, ఒక నిర్ణీత ప్రయోజనం కోసం (సీజరుహత్య) క్రమక్రమంగా చిన్న కుట్రదారుల కదలికలూ — ఈ గుంపు యొక్క సంఘర్షణను చిత్రించేవాళ్లం.

... 'జూలియస్ సీజర్' నాటకం మీద మేము ఏర్పాటు చేసిన రోజుల్లో కలిగిన కొన్ని సమస్యలు జ్ఞాపకం తెచ్చుకుని వ్రాస్తున్నాను.

ఉదాహరణకి, సీజర్ హత్యాదృశ్యంలో షేక్‌స్పియర్ హఠాత్తుగా లాటిన్‌మాటలు ఎందుకు వాడాడు? హత్య చేయబడుతున్న సీజర్ "ఎట్ టూ బ్రూటే" (నువ్వుకూడానా, బ్రూటస్!) అని లాటిన్‌లో అంటాడు. ఆ సన్నివేశంలో కల్లా అత్యంత ప్రధానమైన క్షణాల్లో, భావోద్రేకాన్ని వెలిబుచ్చడానికి మామూలుభాష చాలదు. తనకి అత్యంత ప్రియమిత్రుడైన వ్యక్తిగూడా తన్ను కత్తిపోటు పొడిచినప్పుడు అనుభవించే బాధను మాటల్లో చెప్పించడం ఎలా? పూర్తి నిశ్శబ్దమో, బాధాపూరితమైన సంగీత ధ్వనులో, లేక, షేక్‌స్పియర్ చేసినట్లు ఇంగ్లీషు వదలేసి సీజర్ మాతృభాషయైన లాటిన్‌భాషో ఉపయోగించాలి! ఈవిధంగా ఐసెన్‌స్టీన్ ఆసమస్యను వివరించేవాడు.

దీనితరవాత ఒక్కొక్క ముఠాయే వచ్చి దృశ్యాన్ని నటించడం జరిగేది. క్లాసులో కుర్చీలు, బల్లలు దొరికితే వాటినే రంగస్థలంగా ఉపయోగించేవాళ్లం. [illegible] బ్లాక్ బోర్డుమీద డిజైన్లుకూడా గీసిచూపేవాళ్లం. ఒక్కొక్క ముఠావారు దృశ్యం ప్రదర్శిస్తుంటే మిగతావారూ, ఐసెన్‌స్టీనూ తమతమ విమర్శాత్మక ప్రాయాలు వెల్లడించేవారు.

దీనితో మాపనిలో మొదటిఘట్టం ముగిసేది. ఇంతవరకూ నాటకంగా ప్రదర్శించడం మాత్రమే జరిగేది. తరవాత అదే దృశ్యాన్ని సైలెంటు చిత్రంగా నిర్మించే విధానం నేర్చుకునే వాళ్లం. మొదట ఆ దృశ్యాన్ని 'షాట్లు' గా విభజించాలి. ఇక్కడే ఐసెన్‌స్టీన్ సినిమా శాస్త్రానికి ప్రసాదించిన కొత్తసిద్ధాంతం అవసరం కలుగుతుంది దాని పేరే 'మాంటేజ్' లేక, ఎడిటింగ్. ఎడిటింగ్‌కు ఐజెన్‌స్టీన్ ఇచ్చిన అర్థం వేరు, మిగతావాళ్లు ఇచ్చిన అర్థం వేరు. ప్రతికళలోనూ శిల్పభాగానికి సంబంధించి వంతవరకూ ఎడిటింగ్ అనేక

లేందే పని జరగదని ఆయన నిరూపించాడు. రెండు విభిన్నమైన భావాల సంఘర్షణద్వారా మరొక కొత్తభావం ఉత్పన్నమౌతుందని ఆయన బోధించాడు. దీనికి చైనీస్ భాషనుంచి ఉదాహరణలిచ్చేవాడు. చైనీస్ భాష బొమ్మలద్వారా అర్థాన్ని తెలియజేస్తుంది. తలుపుబొమ్మ + చెవి బొమ్మ = రహస్యంగా పొంచివినడం; నోరు + పక్షులు = పాడడం; కత్తి + గుండె = దుఃఖం.

"మాంటేజ్ అంటే ఇదే" అని ఐజెన్‌స్టీన్ సిద్ధాంతీకరించాడు.

సినిమాకళ నాటకరంగంలోంచి అభివృద్ధి, పరిణామం పొంది ఉద్భవించినదే. కనుక మా కోర్సులో ముందు నాటకంగా ప్రదర్శించడం అయిన తర్వాత సైలెంటు చిత్రంగా చిత్రించడం నేర్చుకునే వాళ్లం. ప్రతివిద్యార్థి తనకు డ్రాయింగు వచ్చినా రాకపోయినా, తను తీయదలుచుకున్న ప్రతిషాట్‌ను పూర్తివివరాలతో సహా బొమ్మవేసి చూపించాల్సిందే. ప్రతి డైరెక్టరూ తను మనస్సులో ఊహించుకున్న షాట్‌ను బొమ్మ రూపంలో ఆర్టుడైరెక్టరుకూ, ఫోటోగ్రాఫర్‌కూ స్పష్టంగా చూపించగలిగి ఉండాలని ఐజెన్‌స్టీన్ పట్టుపట్టేవాడు.

ఆతరవాత 'జూలియస్ సీజర్' లోని అదేదృశ్యాన్ని శబ్దచిత్రంగా అయితే ఎలా నిర్మించాలో నేర్చుకునేవాళ్లం. ఆతరవాత వర్ణచిత్రంగా నిర్మించడం నేర్చుకునే వాళ్లం. దీన్నిబట్టి ఐజెన్‌స్టీన్ సినిమాకళ తాలూకు వివిధ చారిత్రిక దశలను (సైలెంటు చిత్రం, శబ్దచిత్రం, వర్ణచిత్రం) విద్యార్థులకు కరతలామలకం చేసేవాడని గ్రహించవచ్చు.

ఈ ఎక్స్పెరిమెంటు వల్ల చాలా తమాషా ఫలితాలు కలిగేవని వేరే చెప్పనక్కర్లేదు. ఒకే దృశ్యాన్ని నాలుగు విధానాలలో ప్రదర్శించేటప్పటికి, సుమారు ముప్ఫయి రకాల ఫిల్ము ట్రీట్‌మెంట్లు తయారయ్యేవి. ప్రతిదీ యథార్థంగా ఆచరణలో పెట్టడానికి వీలైనంత సమగ్రంగా తయారయేది.

పైన చెప్పినదంతా ఐజెన్‌సీన్ విద్యాబోధనలో ఒక పద్ధతిమాత్రమే. ఆయన ఇంకా భిన్నభిన్నమైన పద్ధతులద్వారా ఫిలిం డైరెక్షను బోధించేవాడు.

మేము విద్యాభ్యాసం పూర్తయి వెళ్లిపోయే రోజున ఆయన అన్న ఆఖరు మాటలివి: 'మీరు మీ మొట్టమొదటి చిత్రం నిర్మించడానికి ఉపక్రమించే ముందు నన్నూ, మాంటేజ్‌ను గురించి నేను చెప్పిందీ అంతా మరిచిపొండి. ఇక్కడ మీరు చిత్రం తీసే పద్ధతి నేర్చుకున్నారు; అక్కడ మీరు యథార్థంగా చిత్రం తీయాలి. యథార్థంగా చిత్రం తీస్తుంటే గాని, మీరు నేర్చుకున్న దాంట్లోని సత్యాసత్యాలు వ్యక్తంకావు.''



శ్రీ రాజరాజేశ్వరి వారి ''లక్ష్మి''లో కృష్ణకుమారి, రేలంగి, హేమలతమ్మారావు, భానుమతి.

## ★ సినిమా వార్తలు ★

సెన్సార్ కత్తెరలో చిక్కుకున్న చిత్రాల జాబితాలో కొత్తగా చేరినచిత్రం రోహిణీవారి "ప్రతిజ్ఞ". ఈచిత్రం మొదట సెన్సార్లకు చూపినప్పుడు వారు చిత్రాన్ని పూర్తిగా నిరాకరించారట. తరవాత వారికీ, నిర్మాతలకూ సమాధానం కుదిరినందువల్ల కొద్దిమార్పులుచేస్తే చిత్రాన్ని అంగీకరించడానికి సెన్సార్లు ఒప్పుకున్నారు. దీని ఫలితంగా ఆ చిత్రంలో సుమారు రెండువేల అడుగులు తగ్గించి ఈ నెలాఖరులోగా విడుదల చేయడానికి నిర్మాతలు నిశ్చయించారని తెలుస్తోంది.

*　*　*

ఘంటసాల బలరామయ్యగారు తీస్తున్న జానపద చిత్రానికి ఈనెల తొమ్మిదో తేదీ మధ్యాహ్నం రేవతీ స్టూడియోలో ప్రారంభోత్సవం జరిగింది. షూటింగ్ కూడా ప్రారంభమైంది. ఈ చిత్రంలో అంజలీదేవి, ఎన్. టి. రామారావు, ముక్కామల ప్రధానపాత్రలు ధరించుతున్నారు.

సారథీవారు తయారుచేస్తున్న చిత్రానికి "అంతా మనవాళ్లే" అని పేరుపెట్టారు. ఈ చిత్రానికి దర్శకుడు తాపీ చాణక్య. చాలవరకూ తయారైందని, త్వరలో విడుదలకు సిద్ధంకాగలదని తెలుస్తోంది.

కృష్ణా పిక్చర్సువారు కొత్తగా ఒక జానపద చిత్రం ప్రారంభించారు. దీనికి యోగానందగారు దర్శకత్వం నిర్వహిస్తున్నారు. ★

## స్వీకారం.

రాడికల్ హ్యూమనిస్టు: రాడికల్ హ్యూమనిస్టు ఉద్యమ (తెలుగు) వారపత్రిక. సంపాదకుడు— వి. గోపాలకృష్ణమూర్తి: కార్యాలయం తెనాలి: వెల రు. 0-3-0.

థామస్ జెఫర్సన్: జీవితచరిత్ర: ఇండియన్ యూనివర్సిటీ పబ్లిషర్సు, (కాశ్మీరుగేట్, ఢిల్లీ—6) ప్రచురణ: రచన జినీ లిసిట్‌జ్కీ: వెల రు. 1-8-0.

"ఒరేయ్, నువ్వు మరీ కోతివై పోతున్నావురా?" అని కొడుకుని తండ్రి మందలిస్తూ ఇలా అడిగాడు. "కోతి అంటే తెలుసా?"

"తెలియకేం? కోతికి పుట్టినదేగా కోతి?

*　*　*

"నాన్నా, మన పూర్వీకులు కోతులట, నిజమేనా?"

"ఏమో తెలియదు. నా పూర్వం వాళ్లలో కోతులు లేవు; మీ అమ్మవైపున వున్నారేమో?" ★



సోవియట్ యూనియన్‌లో భారత చిత్రకళా ప్రదర్శనం.

#  ఘంటారావం 

(9 వ పేజీ తరువాయి)

కంఠధ్వనులు బిగ్గరగా వినరావడంవల్ల ప్రేక్షకులు అటు తిరిగారు. కాని అప్పటికే అందరికీ కథలో ఆసక్తి నశించింది. అయినా నటులు విశ్రాంతినుంచి లేచారు. 'బంగారుచేప' నెవరి కివ్వాలి అని తర్కించారు. 'బంగారు చేప' గుణగణాలను ప్రశంసించి అర్హులెవరై ఉంటారని యోచించారు. నటులకు ఇంత వ్యవధి పట్టుతున్నదే కాని చివరికి వా రెవరిని నిర్ణయిస్తారో ప్రేక్షకు లప్పుడే గ్రహించారు. ఆమె ఫ్లాండర్స్ రాకుమారి! అయితే నాటకం ఇంకా అంతవరకూ సాగలేదు. మధ్యలో మరొక అవాంతరం వచ్చింది. అతిథులవేదిక వెనకద్వారం తెరుచుకుంది. బోర్బన్ కార్డినల్ ఠీవిగా ప్రవేశించారు. ప్రతీహారి బిగ్గరగా ప్రకటించాడు. ప్రేక్షకులందరూ వేదికవైపు తిరిగారు. నటులు ఆగిపోయారు.

ప్రవర్తనకులోనై సంఘములో పాల్గొంటారు. నేటి ఉత్సవంలో అవినీతి, నిషేధం అనేవి పాటించనవసరం లేదు. ఇంక మతాధికారిని మన్నించాలనే నిర్బంధంకూడా అనవసరమే. ఎవరేమిఅన్నా, ఎవరు దూషించినా ఇటువంటిరోజున అధికారులు కనీ విననట్లు, తప్పించుకు తిరుగుతారు.

కార్డినల్ తన అతిథుల సత్కారం గమనించడంలో నిమగ్నుడైనాడు. ఈ అతిథుల ప్రవర్తనచూసి రెండురోజులుగా కార్డినల్ విసుగుచెంది ఉన్నాడు. అధికారంలో కాని సామాజిక వ్యవస్థలో కాని అతిథులు కార్డినల్‌తో పోల్చడానికి అర్హులు కారు. వారిని సత్కరించడం అతడికి బాధ కలిగించింది. అతిథివర్గంలో రకరకాల వారున్నారు. చివరికి ఫ్లాండర్స్ రాజుగారి దర్జీకూడా అతిథిగా రావడం మరింత చిరాకు కలిగించింది. ప్రతీహారి అతణ్ణి ముందట అటకాయించాడు. తరువాత [illegible]

పక్కింటి వాసుగాడితో ఇందిర అన్నాలాట ఆడుతోంది. వాళ్ళగోల భరించలేక ఇందిరఅమ్మ యింట్లోంచి కేకేసింది:

"ఇందిరా, అంత శాకిగోల చేయకుండా నెమ్మదిగా ఆడుకోరాదటే?"

"ఈ ఆట నెమ్మదిగా ఆడటానికి వీల్లేదే అమ్మా! వాసూయేమో, ఇంటి కాలస్యంగా వచ్చే నన్నా, నేనేమో నువ్వూ..." అని ఇందిర సమాధాన మిచ్చింది.

# ★ ఘంటారావం ★

చిన్న బాలిక వచ్చింది. ఫ్లాండర్స్ రాకుమార్తె కీమె ప్రతినిధి అన్నమాట.

బంగారుచేపకోసం - అనగా ఫ్రెంచి రాకుమారునికోసం - వీనస్‌కీ, ఫ్లాండర్స్ రాకుమారికీ తగవు తీరలేదు. ఇంక క్రీస్తుదేవుని తల్లి - మేరీకన్య - తీర్పు చెప్పవలసిందే. తీర్పు రాకుమారి పరంగానే జరిగిపోయిందని అందరికీ తెలుసు.

ఇంత జరుగుతున్నా ప్రేక్షకులు ఆసక్తి చూపలేకపోతున్నారు. కవీశ్వరుని గుండె వ్రయ్యలౌతోంది.

ఇంతలోనే మరొక అంతరాయం సంభవించింది. అతిథి కోపెనోలా లేచి వేదికపైనుంచె ప్రేక్షకుల్ని సంబోధించి ఉపన్యసించ నారంభించాడు. ప్రేక్షకుల కోలాహలంలో ఉపన్యాసం కొంత వినపడలేదు. కోలాహలం తగ్గగానే ఇలా చెప్పాడు: "అక్కడ రంగస్థలంమీద ఏం జరుగుతోందో ఏం తెలియడంలేదు. అక్కడ వాళ్ళెందుకు కీచులాడుతున్నారో తెలియదు. పోనీ కొట్టుకోనైనా కొట్టుకోరు. ఇంతకంటె కుస్తీలు చూడ్డం మేలు. అసలివాళ ఇక్కడ జరిగే దేమిటి. ఇవాళ పండగ ప్రజలందరిదీ. మూర్ఖాగ్రేసరుని ఎన్నిక జరగాలి. ఆ నాటకం ఆపేసి, అసలు పండగ చేసుకోడం మంచిది. ఈ పండగ మా దేశంలో విచిత్రంగా జరుగుతుంది. ఇక్కడ ఈ పూట అదే పద్ధతిని ఎన్నిక జరుపుదాం. జనంలోనించి ఒక్కొక్కళ్ళే వచ్చి తెరలోనుంచి ముఖాలు చూపాలి. అందరిలోకీ వికృతిరూపి యెవడో వాణ్ణి మూర్ఖాగ్రేసరుడిగా ఎంచుకుంటాం. ఏమంటారు? ఈ పద్ధతి బాగుందా లేదా?"

జనం చప్పట్లు కొట్టి సమ్మతి తెలిపారు. గ్రింగైర్‌కి మూర్ఛ వచ్చినట్లయింది. ఒక స్తంభాన్ని ఆనుకుని నిలబడలేక నిలబడ్డాడు. నటీనటులు రంగస్థలంమీద చిత్రప్రతిమల మాదిరి నిలబడిపోయారు. కవీశ్వరునికి మాట పడిపోయింది.

కన్ను మూసి తెరిచేటంతలో కొందరు రంగస్థలంమీది కెగబడ్డారు. నటీనటులు పరదాలోకి పారిపోయారు. ప్రేక్షకులు కొందరు మధ్య పెద్ద రంధ్రం ఏర్పడేలాగ తెర చించివేశారు.

కార్డినల్ ఇంక భరించలేక లేచాడు. రాచకార్యాలు మించిపోతున్నాయనే వంకతో నిష్క్రమించాడు. అతనివెనుక కొందరు నిష్క్రమించారు. రాయబారవర్గం మాత్రం వేదికపై మిగిలారు. కోపెనోలా ప్రేక్షకు లందరికీ నాయకుడైనాడు. వేదికపైనుంచే ఆజ్ఞలిచ్చి ఏర్పాట్లు చేయిస్తున్నాడు. జనమంతా అటూ ఇటూ కదిలిపోతున్నారు.

ముఖాకృతుల పరీక్ష ప్రారంభమయింది. తెరమధ్యలోనుంచి రకరకాల ముఖాలు ఒకటి వెంట ఒకటి కనపడి అదృశ్యమౌతున్నాయి. ఒక్కొక్క ముఖాన్ని చూసి ప్రేక్షకులు గొల్లుమని నవ్వుతున్నారు. ఉన్మత్త ప్రలాపాలు చెలరేగుతున్నాయి. ప్రపంచంలో మనుష్యులు ఎంత వికృతాకృతి ధరించగలరో ఇక్కడ బోధపడుతున్నది రోష ద్వేష భీభత్సాది సకలభావాలూ ఆకృతి ధరించి ప్రత్యక్షమౌతున్నాయి. పిన్న వయస్కుల మొదలు శిథిల వృద్ధుల వరకూ అందరూ పోటీ చేస్తున్నారు. నక్క మూపులు, తోడేలుకోరలు, వరాహమూర్తులు అన్నీ కానవస్తున్నాయి. అంతటంతట ప్రజల ఉన్మాదం మితిమీరుతున్నది. మందిరమంతా అయోమయంగా ఉంది. అకస్మాత్తుగా ఒక్కసారి అందరూ ఏక కంఠంతో అరిచారు. తెరలో చూసేసరికి కొందరు ఉలికిపడ్డారు. 'మూర్ఖాగ్రేసరుడు' ఎన్నుకోబడ్డాడు. తెర వెనుకనుంచి అతడిని తీసుకు వచ్చారు.

ఇంతకంటె వికృతాకారం, భీకరాకారం ఉండబోదు అంటే నమ్మడం కష్టం. అతడితో ఎవరూ పోటీ చెయ్యలేరని అందరూ అంగీకరించారు. పైకి పొంగి ముఖానికి అతికినట్లున్న పెద్ద బండ ముక్కు, గుర్రపుడెక్కవలెనున్న మూతి, కనుబొమ్మల దట్టపు వెంట్రుకలలో మూసికొనిపోయిన ఒక కన్ను, గొగ్గిపళ్ళు, పెదవులు దాటి చొచ్చుకుని వచ్చిన ఒక కోరపన్ను, జీవంలేనట్లు కిందికి వేలాడుతున్న కింది తటపెదవి, వెనక్కు తోసుకుపోయిన గడ్డం, అన్నిటికీ మించి జుగుప్స, ఆశ్చర్యం, విషాదభావాలు మిళితమై ఉట్టిపడే ముఖకవళిక చూసేవారికి భయోత్పాతం కలిగించింది వికటాట్టహాస మనుకున్న అతడి ముఖభంగిమ సహజస్థితమైన దేనని తెలిసినప్పుడు ప్రజలు ఆశ్చర్యచకితులైనారు. అసలు మనిషి ఆకారమే ఒక వికృతహాసం. శరీరానికి తగనంత పెద్ద తల; తల నిండా ఎర్రని జుట్టు అట్టలు కట్టివుంది. తలకంటె ఎత్తైన గూని, గడ్డాన్ని తాకి ముందుకు చొచ్చుకు వచ్చిన ఛాతీ, కొడవళ్ళవలె వంగిన దొడ్డి కాళ్లు, పెద్దపెద్ద పాదాలు, వంకర తిరిగినా ఇనుమును వంచగల బలిష్ఠమైన చేతులు—ఈ ఆకారాన్ని చూసి స్త్రీలు, శిశువులు కెవ్వుమన్నారు. అందరినీ విదలించి నిలబడ్డాడు ఒంటికన్ను రాకాసి. ఇంత వికృతాకారంలో ఇంతటి మహాశక్తి ఎలా వున్నదో ఆశ్చర్యకరమైన విషయం. ఒక మహాశక్తి సంపన్నుడైన దానవుని ముద్దగా పోగుచేసి మనిషి ఆకారంలో పోతపోసినట్లున్నాడు.

చాలమంది అతణ్ని గుర్తుపట్టారు. "క్వాసిమోడో, క్వాసిమోడో" అని కేకలు మిన్నుముట్టాయి.

"చర్చిలో గంటలు కొట్టేవాడు."

"నాటర్ డామ్ చర్చిలో తిరిగే గూనివాడు."

"ఒంటికన్ను రాకాసి."

స్త్రీలు కళ్లు మూసుకొన్నారు.

"అబ్బ! ఎంత భయంకరంగా ఉన్నాడు."

"సైతాన్ భూమికి పంపిన రాక్షసుడు."

"సైతాన్."

"రాత్రివేళ నాటర్‌డామ్ చర్చి ప్రక్క ఇళ్ల కప్పులమీద తిరుగుతూవుంటాడు."

"ఆమధ్య ఒక రాత్రి మా ఇంటికప్పుమీదనించి వొంగి ఇంట్లోకి తొంగిచూశాడు. మొదట మనిషనుకోలేదు. భయపడిపోయాను."

"మా యింటిమీద ఒకసారి చీపురుకట్ట వొదిలేసి వెళ్ళాడు."

"మంత్రకత్తెలకి గురువనుకుంటాను."

"చేతబడి చేస్తాడట."

"దయ్యాలతో భూతాలతో వీడికి స్నేహంకూడా."

ఈమాదిరి వర్ణనలకి అంతులేదు. క్వాసిమోడో రంగస్థలంపైన నిలబడ్డాడు. ఒకడు అతణ్ని సమీపించి తిన్నగా ముఖంలోకి చూసి ముఖంమీదనే పకాలున నవ్వాడు. క్వాసిమోడో ఒక్కమాటైనా మాటాడకుండా అతణ్ని ఒక్క చేత్తో నడుంపట్టి ఎత్తి పదిఅడుగుల దూరానికి విసిరివేశాడు. "అమ్మా" అంటూ వాడు ఎముకలు విరిగి ఏడువనారంభించాడు.

కోపెనోలా ఆశ్చర్యానికి అంతులేదు. గబగబ వేదిక దిగి వెళ్ళి క్వాసిమోడో మూపు తట్టాడు. క్వాసిమోడో కదలలేదు. "నీవంటి బలవంతుణ్ని ఎక్కడా చూడలేదోయ్! మనం కుస్తీ పడదామా ఒకసారి?" అన్నాడు.

క్వాసిమోడో జవాబివ్వలేదు.

"ఏమిటి? నీకు చెముడు కూడానా?" అన్నాడు ఆశ్చర్యపోయి.

క్వాసిమోడో నిజంగా బధిరుడు. కోపెనోలా మరోకసారి మూపు తట్టాడు. గిరుక్కున తిరిగాడు క్వాసిమోడో. వెంటనే వెనక్కు దూకాడు కోపెనోలా. అందరూ ఎడమిచ్చారు. క్వాసిమోడో చుట్టూ పదిబారల దూరం తప్పుకున్నారు జనం.

"చెవిటివాడు పాపం" అన్నది ఒక వృద్ధవనిత.

కోపెనోలా తేరుకుని అన్నాడు: "ఇంక వీడికి లేని వికారమేమిటో!"

"గొడ్డికాళ్లు—అయినా నడుస్తాడు. ఒంటికన్ను-అయినా మనకంటె చురుగ్గా చూస్తాడు. మాట్లాడాలంటే చెవుడు అడ్డు. ఎల్లా వీడితో?"

"తల్చుకుంటే మాట్లాడగలడు. గుడిగంటలు వాయించడం వల్ల చెవుడొచ్చింది. మూగవాడు కాదు."

"మూగతనం కూడా ఉంటే అక్కడికి పూర్తి అవును."

"ఓ కన్ను ఎక్కువ కూడా వుంది."

ఈలోగా కుంటివాళ్ళు, గుడ్డివాళ్ళు, బికారులు, జేబుదొంగలు మొదలైన ప్రవీణులందరూ చుట్టుప్రక్కల వెదికి, అట్టలతో 'కిరీటం' తయారుచేసి, బల్లచెక్కల పల్లకీ ఒకటి తెచ్చారు. 'మూర్ఖాగ్రేసరు'నికి కిరీటం ధరింపచేశారు. క్వాసిమోడో అడ్డుపెట్టలేదు. పల్లకీ అనే బల్లమీద ఠీవిగా కూర్చున్నాడు. పన్నెండు మంది 'మూర్ఖులు' పల్లకి ఎత్తారు. పాలికేకలతో బొబ్బలతో జనమంతా మూర్ఖాగ్రేసరుని ఊరేగింపుతో నగరవీధులవెంట బయలుదేరారు.

దాసీది ఖంగారుగావచ్చి యజమానురాలితో చెప్పింది: "అయ్యగారికి పోస్టువాడు ఏదో పార్సిలు ఇచ్చి వెళ్లాడమ్మా; అది తెరిచీ తెరవగానే అయ్యగారు మూర్ఛపోయారు. త్వరగా రండి."

యజమానురాలి మొహం సంతోషంతో వికసించింది.

"కలకత్తా కంపెనీవాళ్లు నెక్లెసు పంపించారన్నమాట."

## 4

ఇది జరుగుతున్నంతసేపూ గ్రింగైర్ నిశ్చేష్టుడై చూస్తూ ఉండిపోయాడు. కొంతసేపటికి సభామందిరం ఖాళీ అయిపోయింది. "పీడా పోయిందిలే" అని చేతులు విదల్చుకున్నాడు. రంగస్థలం వెనుక చూశాడు. బాండ్ మేళం లేదు; వాద్యాలతో సహా మేళం ఊరేగింపులో కలిసిపోయారు.

కవీశ్వరుడు మందిరంనుంచి బైటపడ్డాడు. ఇక్కడ నలుగురైదుగురు విద్యార్థులు చేరి మాట్లాడుకుంటున్నారు:

"గ్విలామ్‌కి ఒక పెద్ద భవనం ఇచ్చారుట ప్రభుత్వం."

"ఎవరు? చరిత్ర రచించేవాడేనా?"

"అవును. నెలకి వెయ్యి ఇస్తారుట."

"అబ్బా!"

కవీశ్వరుడు చెవులు నిక్కబొడుచుకుని విన్నాడు. "అంత డబ్బే!" అనుకున్నాడు.

"అదుగోరా ఆ అమ్మాయి."

"ఎవరు?"

"ఎమురాల్డా"

"ఎమురాల్డా!"

"ఈ మాటలకి అక్కడక్కడ చేరిన జనం అందరూ అటూ ఇటూ చూడ్డం మొదలెట్టారు.

"ఎమురాల్డా? అంటే?" అన్నాడు గ్రింగైర్. "ఇదేదో ఈజిప్షునించి వొచ్చిన పేరుకాబోలు" అనుకున్నాడు.

(ఇంకా వుంది)

# ★ చెదిరిన చీకట్లు ★

(11-వ పేజీ తరువాయి)

చనపెట్టావ్! వీడు నిజంగా గుండెలు తీసినబంటు!" అని నుదుటిపై వేలేసుకొని రెండుచిటికెలు వేశాడు "అవును మనం నిజాయితీగాపోతే లాభంలేదు నిజాయితీ అనేది ఎక్కడో పాతపుస్తకాలలో జీర్ణించిపోయినమాట దానికిప్పుడు విలువలేదు అయినా వారిజాక్షులందు, వైవాహికములందు 'ప్రాణ, విత్త, మాన, భంగమందు" అబద్ధం పలకవచ్చునన్నారు పెద్దలు ఈచీరకొన్నది తనూ ఒక 'వారిజాక్షి' కోసమే పైగా ఆ వారిజాక్షి తనకు 'ప్రాణ' ప్రియమైనది అనగా ప్రాణప్రియమైన వారిజాక్షికోసం, మానవంతుడైన తను విత్తాన్ని వెచ్చించి యీ చీరని కొన్నాడు అందువలన యీ చీర కనుక యీ దుర్మార్గుడు లాగేస్తే యీపై అన్ని హక్కులకీ భంగంకలుగుతుంది కాబట్టి యీ చీరవిషయంలో తను అన్నివిధాలా అబద్ధమాడవలసిన అవసరం ఎంతైనా వుంది అందువలన అతను 'అఘము' ను పొందడు కూడా!

ఇంతకీ "అనాచారభయం నాస్తి అప్పరాచార్య సన్నిధౌ" అన్నట్లుగా యీ కాలంలో అక్షరాలా పాటించవలసిన వేదవాక్కు "అబద్ధభయం నాస్తి ఆఫీసరు సన్నిధౌ" అన్నదే! ఇందులో సందేహం లేదు

ఇంతలో మేనేజరుగారు పరీక్షని ముగించారు మనోహరీదేవి సంతృప్తికరంగా తల నాడించింది

"ఎంతోయ్! దీని ఖరీదు" అన్నారు జేబులో చెయ్యిపెట్టుతూ మేనేజరుగారు అణా పైసలతో సహా ఖరీదు ఇచ్చేసే వాడిలా!

"ఎబ్బే! ఎంతోనాండి అయిదున్నర రూపాయలు" అన్నాడు రామారావు ముక్తసరిగా

"ఆఁ!" అన్నాడు ఒక్కసారిగా అదిరిపడి నీలకంఠరావుగారు శ్రీమతి కూడా ముఖం చిట్లించింది

"అరెరె! ఇంతమంచి చీర అంత తక్కువ ఖరీదు ఎలా ఇచ్చాడోయ్?" అన్నాడు ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ మెల్లిగా జేబులోనించిన చెయ్యి ఒక సిగరెట్టుని తీసి వెలిగించింది

"ఇందులో ఆశ్చర్యపడవలసిన అవసరం ఏమీ లేదండి ఆచీర అంతకన్న ఎక్కువ ఖరీదు చెయ్యదు" అన్నాడు తాపీగా

మేనేజరు గారిముఖం వెలవెలా బోయింది ఇంతటి అనుభవం హోదా గల వ్యక్తి ఒక చిన్న చీరకు వెల కట్టలేకపోవడం . ఆ హోదాకే చిన్నతనం అందులో 'మంచిచీర' అని సర్టిఫికెట్ కూడా ఇచ్చేశాడు తను శ్రీమతిగారుకూడా ముక్కుమీద వేలేసుకొని భర్తవైపు దృష్టి సారించింది

రామారావు తన మాటలు కలిగించిన *Effect* ని పరిశీలిస్తున్నాడు అతి సంతృప్తికరమైన ఫలితాన్నే ఇచ్చాయి మళ్ళీ అందుకున్నాడు *Antonio Speech* ని అనుకరిస్తూ

"అంతేనండి! ఆ చీర అంతకన్నా ఎక్కువ ఖరీదు చెయ్యదు పైకి అలా మెరుస్తూ వుంటుందంతే అందులో రాత్రి చాలా బాగా మెరుస్తుందండి కాని పగలు చూస్తే పట్టు ఇటుకపొడిరంగు నేతకూడా చాలా అలికి అది పగలు కాని తెలియదు

"అలాగా!" అన్నట్లుగా వారిద్దరిముఖాలు ఆశ్చర్యాన్ని ఓడిపోయిన మహావీరుడి ముఖాన్ని ప్రకటించాయి

"నేనకూడా మొదట యిలాగే బోల్తాపడ్డానండి (అంటే మేనేజరు దంపతులు కూడా బోల్తాపడ్డారని ధ్వని!) ఆశ్చర్యపోయి నేనూ కొట్టువాడ్ని ఇలా గడిగాను ఇంత తక్కువఖరీదు కెలాటయ్యా! అని అంటే వాడు నవ్వుతూ చెప్పాడు "పంతులుగారూ మీరు ఇవ్వబోయే పండగ కానుకకి యీ చీర చాలా బాగా వుంటుంది కొన్నాళ్ళుపోయినతరువాత తమకే తెలుస్తుంది" అన్నాడు

ఇంతలో రామారావు మాటకి బంట్రోతు వెంకన్న అడ్డొచ్చాడు

"పంతులుగారు! మీరు వెంకటరత్నం కొట్లోనేనా యీ చీర కొంటా" అన్నాడు ఏదో పూర్వవిషయాన్ని జ్ఞప్తికి దెచ్చుకుంటూ

"ఆఁ! అవును ఆ కొట్లోనే నువ్వు కొన్నావా!", అన్నాడు రామారావు ఆసక్తిగా

"అవునండీ అయ్యగోరు! నేనూ సెల్లాల్లి క్రిందట ఆ కొట్లోనే యిలాంటి చీరే కొన్నానండి, కాని అప్పుడు అయిదు రూపాయలే మా యింటిది నాల్గురోజులు కట్టుకుందం లేనండి కట్టుకుని చాకలికి వేసిందిగదా మళ్ళీ తెచ్చి చూసేసరికి బాబుగారు, ఏం చెప్పనండి "చీర అంతా పిండి పిండి అలికి అలికి అక్కడక్కడ జాడ జాడలు పడిపోయిందండి. రంగంతా అలుముకుపోయి సన్నాసి బట్టలా తయారయ్యింది రెండో రేవులో పూర్తిగా పేలిక పేలికలయిపోయిందండి పట్టి దండుగ!" అన్నాడు విచార సూచకంగా మొగం పెట్టి

మేనేజరు దంపతుల అభిమానం పూర్తిగా దెబ్బతింది

"అంతా! మోసం! మోసం?" అన్నాడు నీలకంఠం గట్టిగా మనోరమాదేవి అమాంతం గిరున ఎడమవైపుకి తిరిగిపోయి మూతి బిగించేసింది కుడివైపుకి

"అవునండి! అంతా మోసమే!" అన్నాడు రామారావు రెట్టిస్తూ

నీలకంఠంగారు ఇక మాట్లాడలేకపోయారు

"అయితే ఎవరికోసం కొన్నావ్ యీ చీర?" అన్నాడు అనుమానంగా

"మా దాసీదానికండి! అది మూడేళ్లబట్టి పండుగకి ఏదో చీర ఇమ్మని వేపుకుతింటోందండి అయితే ఇవ్వలేదు ఈసారి తప్పకుండా యివ్వాలని అందులో కొత్తచీర ఇవ్వాలని పట్టు పట్టిందండి దాని పోరు పడలేక ఆఖరికి యీ చీర కొన్నానండి" అన్నాడు నెమ్మదిగా చురుగ్గా ఒక్కొక్క మాటే సాగదీస్తూ

అప్రయత్నంగా మేనేజరుగారు చేతిలోని చీరని రామారావ్ చేతుల్లోకి విసిరేశారు! ఎంత అప్రతిష్ఠ! ఎంత అవమానం! ఎంత అగౌరవం! నెలకి రెండు వందల యాభై రూపాయలు అసలు జీతం సంపాదించే యీ చేతులు ఎందుకూ పనికిరాని ఒక పనిగత్తె చీరని ఇంతసేపు పట్టుకోవడమా! అరెరె ఎంత అపచారం జరిగింది ప్రపంచంలో ఎంత మోసం వుంది! ఎంత ఘోరం!

చెదిరిన చీకట్లోంచి పకిలిగా నవ్వింది ప్రక్కనే వున్న లైటు స్తంభం

రామారావు మళ్లీ మాట్లాడకుండా చీరని మడతబెట్టి చంకలో బెట్టాడు మెల్లిగా

'వస్తానండి' అన్నాడు ఎంతో వినయంగా.

ఎంతో ఉయిపంతో అంగీకార సూచకంగా మేనేజరుగారు తల ఆడించారు ఆ సమయంలో మాట్లాడడానికి ఆయనకి ఏమాత్రం మనస్కరించలేదు

అడుగులో అడుగు వేసుకుంటూ పార్కు బయటికి వచ్చిన రామారావ్ మళ్ళీ వెనక్కి తిరిగి చూడకుండా ఒకే దౌడు తీశాడు ఇంటివైపుకి.



Edited Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madras



పంచతంత్రం

# సంధి-విగ్రహం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి



అని యనుకొను
నంతలోనె -
ఉపాయ మొకటి
మనసులోన..
మెరుపల్లే
మెరిసింది.

"ఓ బిడాలమా! నమస్కారం - ఇన్నినాళ్లుగా మనమిరు
వురము - ఇరుగు పొరుగుననే నివసించితిమి. - నీకు
కలిగినా ఆపద చూచి - కలుగు విడిచినే వెలికి
వచ్చితిని - పుణ్యానికి పోతే పాపం! - ఈ ఉలూ
కమొకటి దాపురించినది. - ఉరులు కొరికి నిను
విముక్తు చేసెద, - ఘూకము పొల్పడకుండా -
నీవే నను రక్షింపుము!"



"ఆడబోయిన తీర్థమే నాకెదురైనది. - నీ
సహాయమర్థించాలని - నేనూ యోచిస్తున్నా
ఆపద్బాంధవుడవై నీవే యిటు వచ్చావు. -
నీ కెవరి వలననూ హానికలుగదు - దిగులు
చెందకో మూషికమా! - మది భయము
వీడుమో పలితుండా!!"



(ఇంతలోనే) ఉరులు పన్నిన కిరాతుడును
జాగిలములను వెంట నిడుకొని
వేవేగముగా వచ్చుచుండెను.



"మాటలలోపడి మరచిపోయితిమి;
యమకింకరుడదే వచ్చుచుండెను;
నీట ముంచినను పాలముంచినను
నీవే దిక్కని నమ్మితిని!"



కిరాతుండునూ, జాగిలములునూ
సమీపానికి వచ్చే వరకూ
బిడాలమును వలను
పలితుడు కొరుకునట్లు
నటియించుచుండెను.



కిరాతుడు వచ్చుటచేతను
అడుగుల సవ్వడి వినిన ఉలూకము
ఎగిరిపోయి వృక్షమ్మున వ్రాలెను.



ఉలూకమూ ఎగిరిపోవగా
నిర్భయముగ నా మూషికము
వలత్రాళ్లన్నిటి కొరికివేసెను:
వడివడిగా తన కలుగు జేరెను.
మార్జాలమునూ పారిపోయెను.



వలను పడిన ఆ బిడాలము
చేజిక్కినటు చిక్కి జారిపోయెనని
కడు విషాదముతో ఆ నిషాదుడు
నిశ్చేష్టుండై నిలచిపోయెను.



నిషాదుడు
నిట్టూర్పుచు -
ఆచోటు వాసి
చనిన వెనుక -
మార్జాలం
తిరిగివచ్చి -
పలితుని
కలుగు చేరి....

"సకల జీవులు ఔరా యన
నాపై దయ జూపితివి.
తక్షణమే నిను చూడవలెనని
తహతహ చెందుతు వేచియుంటిని
ఆలసింపకయె వెలికి రమ్మిక!"



(పలితుడు: కలుగులోనుంచి)
"శత్రువుతో సఖ్యం చేసినా బుద్ధిమం
తుడూ ఏమరియుండడు. - వలలో
పడి నీవును - కడు బడలియుంటివి.
నేనిప్పుడు వెలికి వచ్చినా - నను
భుజియించి తృప్తిచెందెదవు. -
కావున నేనిక నీకగపడను:
వచ్చిన దారినె వెడలిపొమ్మిక"



పేరాశకుపోయిన
రోమశుడూ -
ఖిన్న వదనుడై
వెడలిపోయెను. -





లంబాడా స్త్రీ

లంబాడాలు – వీరు హైదరాబాదు సంస్థానంలో అధిక సంఖ్యలుగా ఉన్న ఒక జాతివారు, వీరిని దేశంలో వివిధ భాగాలలో అనేక పేర్లతో పిలుస్తారు. వీరు దృఢగాత్రులు, మిక్కిలి పొడుగైనవారు, వీర్యవంతులు, మొగలాయిల విజయం రోజులలో వీరు రాజపుత్రస్థానాన్ని వదలి, ఈ సంస్థానం చేరుకున్నారు. ఇటీవలివరకు వీరు దేశద్రిమ్మరులుగా జీవిస్తూ, సరఫరాలను ఎడ్ల మీద వేసుకుని, ఈ పెద్ద పెద్ద ఎడ్ల మందలను తోలుకుంటూ ఒక ప్రదేశం నుండి మరొక ప్రదేశం చేరుకుంటూ వుండేవారు. ఇప్పుడు వీరు స్వంత భూములలో స్థిరపడి, వ్యవసాయదారులుగా తమ ప్రజ్ఞను కనపరుస్తున్నారు. లంబాడా స్త్రీలు కష్టపడి పనిచేస్తారు. వీరు సాహసోపేతులు ఎల్లప్పుడూ ఉల్లాసంగా ఉంటారు అందరు స్త్రీలవలెనే ఈ జాతి స్త్రీలకు వాడా అలంకరించుకోడమంటే విపరీతమైన మోజు వీరు లోహం, గవ్వలతో తయారైన కడియాలు, గాజులు, బొత్తాములు, ఇతర ఆభరణాలు ధరిస్తారు.

ఇండియాలో మూరు మూలలలోను నివసించెడి వివిధ వర్గాలతో నిరంతర సన్నిహిత సంబంధాన్ని మేము ఏర్పరుచుకున్నాము వారు తమకు కావలసిన పెట్రోలియం ప్రొడక్టుల కు మాపై ఆధారపడుతున్నారు గనుక, మేము కూడా వారి సేవచేయడము గొప్పగా భావిస్తున్నాము.

**బర్మా-షెల్...భారత జీవితంలో ముఖ్య భాగమై యున్నది**

BSY-695B TEL